ప్రథమ ముద్రణ : 1983

ప్రతులు . 2500





ముఖపత్ర రచన : శ్రీ శీలా వీర్రాజు



మూల్యం : రెండున్నర రూపాయలు.

ముద్రణ :

మాధవీ ప్రింటింగ్ ప్రెస్

కుత్బిగూడ - హైదరాబాదు-27.

# ప్రకాశకీయం

—o—

13-7-1983 నుంచి 24-7-1983 వరకు హైదరాబాదు నగరంలో జరిగే "వాసవీ విశ్వశాంతి మహాయజ్ఞం" సందర్భాన్ని పురస్కరించుకొని 'కవిరత్న' రచించిన 'అగ్నిదీప్త' 'కన్యకా చరిత్ర' అనే ఈ చిరుపొత్తం వెలువరించి వైశ్యులందరికీ అతి తక్కువ మూల్యానికి అందిస్తున్నాం. ఈ కన్యకాచరిత్ర పైన ఎన్నెన్నో గ్రంథాలు వచ్చినాయి. అవి పద్య కావ్యాలు, బుర్రకథలు, నాటకాలు. సామాన్య పాఠకులు అంతగా చదివి అర్థం చేసుకోజాలరని వచనంలో ఈ కథను ప్రచురిస్తున్నాం. నూటొక్క గోత్రాల దంపతులతో అగ్నిప్రవేశం చేసి, గుణ ధర్మ శీలాలను పరిరక్షించుకొన్న వాసవి కన్యక శివశక్తి స్వరూపిణిగా విరాజిల్లి వైశ్యుల కెన్నో ధర్మసందేశాలు చేసింది. దుష్టబుద్ధియైన విష్ణువర్ధనరాజును అంతం చేసింది. ఈ కథ 10, 11 శతాబ్దుల మధ్య జరిగినట్లు ఆధారా లున్నాయి. ఈ కథకు మూలం పురాణాలే. రామాయణం జరగకమునుపే వాల్మీకిమహాముని రామాయణం చెప్పినట్లు ఆధారాలున్నాయి. అట్లాగే వాసవి కన్యక పుట్టకముందే ఈ కథ మునుల మనస్సులలో చర్చనీయ

మయి పురాణసంబంధములు కొనియాడబడింది. కథాభాగంలో ఈ విషయాలు తెలుసుకొంటారు. వైశ్యుల ఇలవేల్పుగా వాసవి కన్యక పూజనీయురాలయింది. అందుకే ఈ కథను వెలువరిస్తున్నాం. 'కవిరత్న' శ్రీ నీలా జంగయ్యగారి కథాగ్రంథాన్ని (కృషిని) శ్రీమతి కబళవాయి పుష్పావతిగారికి కానుకగా ఇచ్చి స్త్రీలోకాన్ని గౌరవించారని భావిస్తున్నాం. అందుకు ఉభయుల నభినందిస్తూ పాఠకలోకం ఈ గ్రంథాన్ని చదివి ఆదరించాలని కోరుతున్నాం.

10—7—1983
హైదరాబాదు

భవదీయుడు,
ఎన్. శ్రీధర్



# ముందు మాట

—:o:—

"పరువంబు కలిమి దొరతన
మరయమి యనునట్టి వీనియం దొక డొకడే
పొరయించు ననర్థము నాన్
బరగినచో నాల్గు చెప్పవలయునె చెపుమా!"

ఈ తెలుగు పద్యానికి పూర్వం సంస్కృతంలో "యౌవనం ధనసంపత్తిః ప్రభుత్వ మవివేకితా ఏకైకమప్యనర్థాయ......" అనే ఈ శ్లోకం హితోపదేశంలో చెప్పబడి ఉన్నది. ఈ భావం ఏ భాషలోకి వ్రాసినా ఆ భాషీయు లీ భావాన్ని సమాదరిస్తారు. బహిర్గతమైన వస్తువే ఒక్కనిదీకాదు. కనిపించేదేదీ తనదికాదు-అనే దృఢచిత్తం ఎవనికుందో వాడే మహనీయుడు. అవ్యక్తంగా కవి జీవిస్తే సువ్యక్తంగా కవిత రాణిస్తుంది. అభివ్యక్త గుణం కవితది. అవ్యక్తరూపం కవిది. గుణశీలాలకే ప్రాధాన్య మిచ్చి అవి దైవతుల్యాలుగా భావించిన జీవులలో అనుసరిస్తున్న సంస్కృతి చేర్పులకు కూర్పులకు లోనైనా అనుశ్రుతంగా సాగి వచ్చే సృష్టిధర్మంతో తరించే ప్రయత్నం ఎవరూ మానలేరు-అనే సత్యాన్ని చాటి చెప్పిన కన్యకాపరమేశ్వరి వాసవిగా అవతరించి

కన్యకగా పెరిగి పరమేశ్వరిగా అగ్నిప్రవేశం చేసింది. గుణ
శీలాలకే ప్రాముఖ్య మిచ్చింది. రూపవంతులైనా ధనవంతులైనా
విద్యా బల గర్వభాసితులైన అధికారులైనా గుణశీలాలు లేనిచో
అవి అన్నీ ఉన్నా లేనిదానితో సమానమేనని వైశ్యుల కుపదేశించి
ఆచంద్రతారార్క కీర్తికాంతులతో వర్ధిల్లుతున్నదనే చెప్పాలె.

దేవ రాక్షస యక్ష గంధర్వ గణములనైనా ధర్మశోభితు
లైన గుణశోభితులైన శీలవంతులైన స్త్రీ పురుషులైన మాన
వులు నిర్జించి జీవింతురని ధర్మసూక్ష్మాన్ని చాటి చెప్పింది. దేవ
తలను నిర్జించిన రాక్షసులను నరరూపులైన రామకృష్ణులు నిర్జిం
చారు. నరుడు [అర్జునుడు] దేవతలను జయించినాడు. ఇట్లాంటి
దృష్టాంతాలెన్నో కథలుగా వింటున్నాం. మానవాభ్యుదయాన్ని
త్యాగాలలో చూస్తూనే ఉన్నాం. అన్నిటికన్న తీపి గల వస్తువు
ప్రాణం. ఆ ప్రాణాన్నే త్యాగం చేసిన వాసవి వైశ్యలోకానికే
కాక మానవ జగత్తుకే పూజనీయురా లయింది. ఈనాడు మనం
గాంధేయ స్వారాజ్యంలో జీవిస్తున్నాం. పొట్టి శ్రీరాముని ఆత్మా
ర్పణ సిద్ధిని చూశాం-చావు అందరికీ వస్తుంది. అయితే ఆ చావు
ఏ లక్ష్యంలో వచ్చిందో ఆ లక్ష్యంచేతనే వ్యక్తులు అమరు లవు
తారు. ఆ అమరజీవులు చూపిన త్రోవలో గుణాభిరామ మైన
మానవలోకం ప్రయాణిస్తుంది.



# శ్రీమతి కబళవాయి పుష్పావతిగారి సంక్షిప్త పరిచయం

—★—

సికిందరాబాదులో వీరవెల్లి చంద్రావతి నారాయణులు అనే ధర్మదంపతులకు 29–6–1939న జన్మించి పుష్పావతి పేరుతో వర్ధిల్లి హైదరాబాదులోని కబళవాయి వారింటి గుణ దీపంగా రాధాకృష్ణారావుగారికి సతియై లక్ష్మీప్రసన్న రూపంతో కళారాధకురాలై అలరే ఈ యమ్మలో మా యమ్మ పోలికలు ఉన్నాయి. 1973లో వాసవీ సాహిత్య పరిషత్తు వీరింట్లోనే పుట్టి దానికి నేను అధ్యక్షునిగా ఎన్నుకోబడినాను. ఇంటికి పేరు పుష్పనిలయమైనా చూపరులైన రసమూర్తులకు కళానిలయ మని పించక తప్పదు. ఏ వస్తు వెక్కడుండవలెనో అట్లమర్చిన వస్తు జాలంతో కళాఖండ మనిపించేలా తీర్చడం ఆ పుష్పావతిలో భాసించే రసలక్ష్మికే తెలియాలె. ఇల్లు వేలగజాలలో విస్తరించి ఉన్నతంగా ఉండటం కాదు. ఉన్నంతలో చిన్నదయినా దాన్ని కళాత్మకంగా అలంకరించుకొనేదాన్నిబట్టి బాగా ఉంటుంది. మాటల్లో అమాయకత–చేతల్లో ఆదరణ–చూపుల్లో దయ మూర్తీ భవించిన పుష్పావతిగారి అదృష్టం సప్తసంతాన ప్రశస్తమై అలరినదనే చెప్పాలె.

21-12-1951 న రాధాకృష్ణరావుగారితో వివాహమైన పుష్పావతిగారికి ముద్దులు మూటగట్టే ముగ్గురు మగసంతానం, ఒక్కగానొక్క కూతురు కలిగి అందరి వివాహాలు అయి (చిట్టి ముత్యాలుగా వెలుగుతున్న) ఇద్దరి మనుమరాండ్రతో హాయిగా ఉన్నారు. అదృష్టమంటే ఇట్లా అడిగి తెచ్చుకొనవలెననేటట్లుగా ఆ ఇల్లు ఉండటం చూసిన నాకెంతో ఆనందమయింది.

క్రమంలో వీరి సంతానం-వివరాలు

1. పెద్దబ్బాయి సతీష్ జననం 22-11-1956
2. అమ్మాయి ధనజ జననం 9-11-1958
3. రెండో అబ్బాయి రఘునాథ్ జననం 20-12-1961
4. మూడో అబ్బాయి శ్రీనివాస్ జననం 9-5-1963.

రెండుమూడు సంవత్సరాల ఈడు తేడాతో పుట్టిన ఈ బిడ్డలు కన్నవారికి ఆనందాన్ని పంచే విధంగా బుద్ధిమంతులుగా వర్ధిల్లుతున్నారు-సంతోషించాలె.

శ్రీ రాయంచ రామకృష్ణగారి నాలుగో సంతానం అయిన వరలక్ష్మిగారితో సతీష్‌గారి వివాహం 13-5-1977 న వాసవీ సామూహిక వివాహాల్లో వైశ్య హాస్టల్ కాచిగూడాలో ఆదర్శ ప్రాయంగా నయనపర్వంగా జరిగింది. విందుకు వెళ్ళినాను. ఈ జంటకు అమ్మాయిలు క్రమంలో - మొదట అనూరాధ 25-12-1979న జననమైతే రెండో అమ్మాయి శ్వేత 20-9-81న పుట్టి శివరత్నాలే ఇంట్లో ఆడుకుంటున్నాయా అన్నట్లున్నారు.

పుష్పావతిగారి రెండో సంతానం ధనజ వివాహం 25-3-1976న శ్రీ మారం నాగభూషణం వరంగల్లువారి ప్రథమ పుత్రుడు వీరప్రతాప ఎం. టెక్. (ఇంజనీర్) తో జరిగింది. హాయిగా ఉన్నారు.

మూడో సంతానం శ్రీ రఘునాథ్ వివాహం 23-1-80న శ్రీ కల్వా మనోహర్ (తాండూరు నివాసి) వారి రెండోఅమ్మాయి సుజాతతో వైశ్య హాస్టల్లో జరిగింది. వారికి 26-12-1982న సంతానం కలిగి హరికృష్ణ పేరుతో చిందులు వేస్తున్నాడు.

నాలుగో సంతానం శ్రీనివాస్ వివాహం 2-4-1983 న శ్రీ మరుమాముల జ్ఞానేశ్వర్‌గారి ప్రథమ పుత్రిక వాణిశ్రీతో సికిందరాబాదులో జరిగింది.

ఉత్తమమైన ఇల్లాలుగా తన పతిని శ్రీపతిగా సేవిస్తూ ఇంటివరకే కాకుండా సాంఘిక సేవకు కూడా అడుగు ముందుకు వేసింది శ్రీమతి పుష్పావతిగారు.

శ్రీ వాసవీ మహిళా సంఘం స్థాపక సభ్యురాలిగా ఉండి 1982 లో ఎన్నో కార్యక్రమాలు నిర్వహించినారు. వాసవీ విద్యార్థినీ వసతిగృహ స్థాపక సభ్యురాలిగా-కార్యవర్గ సభ్యురాలిగా ఉండి దాని అభ్యుదయానికి తనవంతుగా పాటుపడుతున్నారు. ఆంధ్రప్రదేశ్ మహిళాసభ రాష్ట్ర కార్యవర్గంలో కోశాధ్యక్షురాలుగా ఉన్నారు.

జ్ఞాన్‌బాగ్ కాలనీలో ఉన్న పుష్పనిలయంలో మనుమ రాండ్రతో ఆడుకొంటూ పతిదేవుడైన రాధాకృష్ణరావుగారిని సంతోషపెట్టిన పుష్పావతిగారి జీవితం పవిత్రమయింది. అందుకే ఈ నా వాసవి కన్యక (వచనం) కాన్కగా ఇచ్చాను. సర్వులూ ఆనందిస్తారని ఆశిస్తూ పుష్పావతిగారు ఆదర్శ గృహిణిగా ఆర్య వైశ్య జనంలో నూరేండ్లుపండగా రాధాకృష్ణారావుగారి ప్రాణమై భాసించాలని వాసవీదేవిని ప్రార్థిస్తున్నాను.

రచయిత





శ్రీ బాసర జ్ఞానసరస్వతీ అమ్మవారు

శారదా ! గుణకల్పవల్లీ !
భారతీ ! రసరాగమల్లీ !
వందనము లివిగో-హృదయ
స్పందనము లివిగో ॥శా॥

నలువమోమున పలుకు చెలివై
లోకజీవన రాగ ఝరివై
అవని తాపము దీర్చు గుణముల
అలరినావమ్మా !-భారతీ ! వెలిగినావమ్మా!   ॥శా॥

మధుర బింబాధర విపంచిని
మాటిమాటికి మీటి తీయని
రాగరసముల దనిపి జీవుల
విలిపినావమ్మా ! జగముల గెలిచినావమ్మా !॥శా॥

మహిత సుకవీంద్రాది ఋషిజన
విదిత హృదయాంతర్విహారిణి !
అమల భావవిహార ! శారద !
నీవ మాయమ్మా ! జీవుల గావరావమ్మా !   ॥శా॥

సర్వభాషాధార మీవై
సరసహృత్కమలాలకొలువై
విశ్వసుందరభావ లతవై
విరిసినావమ్మా ! పృథ్విని వెలసినావమ్మా !

(నా 'మధువనం' పాటల నుంచి)

★ ★

# వాసవీదేవి ప్రార్థనమ్

## 1

ఓం నమో నమో శ్రీ వాసవాంబా !
ఓం నమో నమో వైశ్యకులగుణ కదంబా !
ఓం నమో నమో విశ్వకల్యాణ భావీ !
ఓం నమో నమో త్యాగభావసంజీవీ ! ॥ఓం॥

## 2

పుత్రకామేష్టి వరపుత్రి జనయిత్రీ !
విష్ణువర్ధన దౌష్ట్య వివిహత సుగాత్రీ !
వైశ్యధర్మప్రభా ప్రవిమల సవిత్రీ !
కుసుమభూపతిసుతా ! అసమానసేత్రీ ! ॥ఓం॥

## 3

రాగభోగ విరాగ రాజితమృడానీ !
సకల గుణానంద సార సంధాయినీ !
వీరజనహిత కీర్తి విమలార్థవర్ధనీ !
విశ్వరూపప్రదర్శ విఖ్యాత భామినీ ! ॥ఓం॥

## 4

సర్వజన వైశ్య ప్రియానందవల్లీ!
చారుగుణ హేలా ప్రసన్నగుణమల్లీ!
వరరుచిరహాస దుర్మార్గజన భల్లీ!
సాధుసంపత్ఖనీ! జనకల్పవల్లీ! ॥ఓం॥

## 5

గోరక్ష వాణిజ్య కృషివర్గ శోభినీ!
యజనాధ్యయన దానగుణ లోకపావనీ!
శశ్వదానంద సౌందర్య సువిలాసినీ!
సలలిత పదపల్లవానంద దాయినీ! ॥ఓం॥

## 6

జయ రమ్య పర్వతోన్నతవాస భామినీ!
హల చిహ్న హరిద్రవర్ణ సంకేతనీ!
శుకశోభ వరకమల సుకుమార హస్తే!
నవమలదయావాసవాంబా నమస్తే! ॥ఓం॥

★ ★

## :: కానుక ::

### శ్రీమతి కబళవాయి పుష్పావతి గారికి

కన్నతల్లి కళలు కనిపించె నామెలో
కృతి నొకండు నీయ నెంచుకొంటి
కన్యకాంబ చరిత కడుభక్తితో వ్రాసి
ఇచ్చు కానుక పేర మెచ్చుకొంటి.

నన్ను నేనె మెచ్చుకొన్నది బాగుండ
కెట్లు పోదు ఘటనమిట్లు కుదిరె
కబళవాయి వంశ 'కళ్యాణరత్న' పు
ష్పావతికి నమస్సు లందచేసి.

వైశ్యకులాన వర్ధిలిన
పావనరూపిణి కన్యకా కథన్
వైశ్యకులమ్ము మెచ్చుకొన
వాస్తవమైనటువంటి ఈ కథన్
కాశ్యపి సాక్షిగా నుడువ
గా మది నెంచితి నాంధ్రభాషలో
దేశ్యములైన పల్కులను
దీప్తిగ వాసవినే నుతింపగన్.

పతిగా కృష్ణారావును
హితమతియై పొందె సర్వు లెన్నెడు సుతులన్
హిత గుణ శీలుర ముప్వుర
అతులిత సంపదలు నిండి యాడగ పొందెన్.

చెన్నొదవెడు కథ వాసవి
కన్నియ చరితంబు వచనకథగా గూర్పన్
ఎన్నగ జనములు చదువుదు
రన్న మతిన్ దీర్చి దీని నర్పింతు నాగిన్.

[నా కృతిని కానుకగా గొన్న ప్రప్రథమ మహిళ
శ్రీమతి కబళవాయి పుష్పావతిగారు]

— రచయిత

★★



" అగ్నిదీప్త "

వాసవి కన్యకా చరిత్రను కానుకగా పొందిన

**శ్రీమతి కబళవాయి పుష్పావతి గారు**

వారి పతిదేవులు శ్రీ కబళవాయి రాధాకృష్ణారావుగారు.

# ప్రవేశిక

వస్వర్థ మైన తేజోరూపమే వా స వి. వసు వనగా బంగారము. దేవగణాలలో వసుగణ మున్నది. తెలుగువారు కనకమ్మ-కనకయ్యల పేర్లతో ఉంటటం నేనెరుగుదును. కొందరు బంగారమ్మ బంగారయ్య పేర్లతో ఉన్నారు. వసు విభవ శోభి తులంతా వాసవీయులే. అనగా బంగారమ్మలే అయ్యలే. వైశ్యులు వసువును ధనంగా భావిస్తారు. గోవును దేవతగా పూజిస్తారు. వైశ్యకులంలో యజనాధ్యయన దాన కృషి వాణిజ్య గోరక్షణాది ధర్మకర్మల ననుష్ఠిస్తూ జీవిస్తారు. "వాసవీ కన్యకాపరమేశ్వరి" అవతరించి ఆరాధ్య దేవత యై ప్రకాశించినది. పౌరాణికంగా వైశ్యులు విశేషకీర్తిసంపన్నులుగ వర్ణింపబడి ఉన్నారు. మానవ చరిత్ర యుగపరంపరగా వస్తున్నది. వాసవి కన్యకాపరమేశ్వరి 10-11 శతాబ్దుల మధ్య పెనుగొండలో కుసుమాంబ - కుసుమ శ్రేష్ఠి దంపతులకు పుత్రకామేష్ఠి యజ్ఞ ఫలంగా పుట్టినది. రూప యౌవన గుణ సంపన్నురాలుగా పెరిగినది. విమలాదిత్య విష్ణువర్ధనరాజు దిగ్జయయాత్ర ముగించి తిరిగి వస్తూ దర్శనీయ మైన పెనుగొండపురాన్ని దర్శిస్తాడు. అప్పుడే ఈ వాసవీకన్యకను

చూసి తనకిచ్చి వివాహం చేయమని అడుగుతాడు, వ్యవధినిస్తాడు. వైశ్యులు నిరాకరిస్తారు. అతి బలసంపన్నుడైన మహారాజుతో విరోధం ఏర్పడుతుంది. కన్యకాపరమేశ్వరి అద్భుత దైవశక్తి స్వరూపిణి. కామదృష్టులు సోకిన దేహం సహించనిదై ఆమె అగ్నిప్రవేశం చేయ తలపెట్టి పురుషోత్తముడైన కృష్ణపరమాత్ముడు అర్జునునకు విశ్వరూపం చూపినట్లే మహాదేవి వాసవికన్య వైశ్యులకు విశ్వరూపం చూపించింది. ధర్మోపదేశాలు చేసి అగ్ని ప్రవేశం చేస్తూ, తనతో నూటొక్క గోత్ర దంపతులకు అగ్ని ప్రవేశానికి అనుమతించింది. దుష్టచిత్తుడైన విష్ణువర్ధనుణ్ణి శపించింది. అతడు తల పగిలి చస్తాడు. ఈ ఘటన చరిత్రలో చరిత్రాంశంగా పరంపర మానవాళికి తెలిపే విధంగా వ్రాయబడలేదు. చరిత్రకెక్కని అనేక సంఘటనలు సంఘంలో జనం పాటిస్తూ గౌరవిస్తూ వాటిని బ్రతికించడం జరుగుతుంది. "సారంగధర చరిత్ర, బాలనాగమ్మ కథ" వంటి చరిత్ర లీకోవలోకే వస్తాయి, ఈ కన్యకాచరిత్ర కూడా సంఘం బ్రతికించిన అంశంగా విజ్ఞులు భావించకుండా పోరు. అయితే ఈ వాసవిని దేవతామూర్తిగా సంభావించి గుడులు నిర్మించినారు. పూజలు జరుగుతున్నాయి. వైశ్యులు కులదేవతగా ఆరాధిస్తున్నారు. ఆమె చరిత్రను సమాదరిస్తున్నారు. ఈ చరిత్ర పౌరాణికం కాదన్నా, చారిత్రకము కాదన్నా, సాంఘికము కాకుండా

అంతరించలేదు. సాంఘికచరిత్రలో వాసవిచరిత్ర స్వర్ణశోభితమై వన్నెకెక్కినది. ఎందరెందరో ఈయమ్మ కథను గానంచేసిన గాయకులు, సంస్తుతించిన కథకులు, పౌరాణికులు, కవులు, పండితులు, ఉపన్యాసకులు, కళాకారులున్నారు. గుడి గోపురాలున్నాయి. సంఘం గౌరవించే చరిత్రే చరిత్ర - బలవంతం చేసి వ్రాయించిన చరిత్రలు బ్రతకవు - చదివినా మనసు కెక్కవు. సంఘం గౌరవించని భావాలు రాచరికాలు నేలమీద దుమ్ముకొట్టుక పోయినాయి. విగ్రహారాధన నిరసించేవారూ ఉన్నారు. నాస్తికులూ ఉన్నారు - అయినా ఆస్తికత చావలేదు. విగ్రహారాధన చేస్తూనే సంఘం తరిస్తుంది. మంచికి చేతులెత్తి దండంపెట్టి సంఘం బ్రతికి ముందుకు సాగిపోతూనే ఉన్నది. అమ్మవారు విశ్వరూప ప్రదర్శనం చేసిన సమయంలోనే చతుర్భుజాకృతిలో కనపట్టినది. పార్వత్యంశములో ఉన్న కన్యకనని, వాసవినని చెప్పుకొన్నది. భారతీయమైన విజ్ఞాన మంతయూ దైవపూజ్యంగా సంభావితమయింది. భూదేవి-అగ్నిదేవుడు, వరుణదేవుడు ఇత్యాదులుగా సమస్తసృష్టిని దైవస్వరూపంగా కొలిచినది. మానవుడు దైవభావనచే చింతనచే తరిస్తాడని తనశక్తులు తద్వారా సుస్థిరమై శోభిస్తాయని నమ్మకంతో ఆత్రోవలో వచ్చిన సాహిత్యాన్ని సంఘం సమాదరించింది.

నిర్వికార నిర్మల మనస్తత్వానికి ప్రాధాన్యమిచ్చిన భార తీయుల విజ్ఞానం వేదపురాణ ఉపనిషదాది కావ్యసంపన్నమై భాసించినది. అందుకే వాసవీకన్యకా పురాణ మంటారు. వైశ్య పురాణ మంటారు. కేవలం వాసవిచరిత్రమాత్రమే రచనాంశంగా గ్రహించి వ్రాసిన విషయాలు కన్యకా చరిత్ర-లేదా వాసవీ కన్యక చరిత్ర వంటి నామాలతో గ్రంథాలుగా ప్రకటితమై ఉన్నాయి.

పవిత్రమైన ఊహలతో- భావనలతో వ్రాయబడిన కృతు లకే సంఘం నివాళులెత్తింది.

వాసవి కన్యకా పురాణంగా, వాసవి కన్యకా చరిత్రగా, కథగా, కన్యకా పరమేశ్వరిచరిత్రగా సంస్కృతాంధ్ర భాషలలో ఎన్నో గ్రంథాలున్నాయి. ఇటీవలవాసవిగీత, సుప్రభాతమని, స్తోత్రమని, పాట యని, సప్తశతియని, సుధయని బుర్రకథ యని, వ్రతకల్పమని, ఉద్దండ కవిపండితులెందరో గ్రంథాలు ప్రకటించినారు. వైశ్య పురాణం, వైశ్య ధర్మప్రకాశిక వంటి పేర్లతోనేగాక స్తవములు, స్తోత్రములు, హరికథలు — నాటక ములు, యక్షగానాలు, కావ్యాలు - లఘు కావ్యాలు గద్య పద్యాలలో, కీర్తనలలో కన్యకాంబ జీవితాన్ని ప్రస్తుతించి వ్రాసి నారు. లోకారాధ్య దేవతగా - వైశ్యకుల దేవతగా మిక్కిలి

కొనియాడబడిన ఈ యమ్మ చరిత్రను అన్నికులాలవారు ప్రస్తు
తించారు. పెనుగొండ, ప్రొద్దుటూరువంటి పట్టణాలలో ,మహా
నగరాలలో, కుగ్రామాలలో సైతం ఆమె ఆలయాలున్నాయి.
ఆమె చరిత్రకు కేంద్రమైన పెనుగొండలో నిత్యపూజలు (కన్య
కాంబకు) జరుగుతున్నాయి. ఆధునిక సారస్వత యుగానికి
యుగపురుషుడుగా, సాహిత్య చరిత్రలో చోటు సంపాదించిన
మహాకవి గురజాడవారు కూడా అమ్మ చరిత్రను " కన్యక "
పేరుతో ముత్యాల సరంలో కూర్చకపోలేదు. సినిమాలుగా
కూడా అమ్మ చరిత్ర ప్రచారమయింది. అయిందని కాదు -
ఇంకా ఎంతో కావలసివుంది. ఒకటా రెండా ! నూట రెండు
కుటుంబాల వైశ్య దంపతులు అధర్మ రాజరిక సత్తాను ధిక్క
రించి అగ్నిప్రవేశంచేసి ఆ రాచరిక సత్తాకు కనువిప్పు కలగ
చేసిన మొట్టమొదటి సత్యాగ్రహి వాసవీ కన్యకయే అవి
సర్వేపల్లి రాధాకృష్ణవంటి మహామేధావుల ప్రస్తుతికి పాత్రమైన
ఈ తల్లి చరిత్రను ఎవరు ఎందుకు కొనియాడరు. అగ్నిలోపుట్టి
అగ్నిలా పెరిగి-అగ్నిలోనే తనువు నంతం చేసినచరిత్ర ఏ తల్లికి
ఉన్నది. ఆ తల్లి వైశ్యలోకానికి ఆచంద్రతారార్క కీర్తిని
ఘటించింది. అమ్మ పీఠాలు కూడా ఉన్నాయి. మా దేవరకొండ
తాలూకా పీఠం చాలా ప్రాముఖ్యమైనది. ప్రాచీనమైనది. మా
బంధువైన కాసం పాపయ్యశ్రేష్ఠిగారు,ఎర్రగుంటపల్లివాస్తవ్యులు

తన తమ్ముడైన అంతయ్యను తీసుకొని ఎన్నో ప్రాంతాలు పర్యటించిన సంగతి నే నెరుగుదును. వైశ్యుల ఇలవేల్పు అమ్మ వారిని (పీఠాన్ని) ఇక దేశాలు త్రిప్పడం నావల్ల కాదని దేవర కొండ ఆర్యవైశ్య సంఘానికి అప్పచెప్పినారు. ఇప్పు డమ్మవారి దేవాలయం గొప్పగా కట్టబడింది. నిత్య పూజలతో అమ్మవారు అఖండ భారతావనిలో చెప్పదగిన ఆంధ్ర కర్నాటక మైసూరు వంటి ముఖ్యనగరాలలో ప్రశస్తనీయమై ఆమె చరిత్ర ప్రపంచా నికే నిత్య మంగళమై శోభిస్తున్నది. ఎక్కడ వైశ్యులు ఉంటే అక్కడ కన్యకా పరమేశ్వరి ఉంటుంది. ఎక్కడ కన్యకా పర మేశ్వరి ఉంటే అక్కడ వైశ్యుడు మంగళ ప్రదమైన జీవనంతో ఉంటాడు. వాసవి యజ్ఞాలు, వ్రతాలు ఇటీవల ఎన్నో జరిగినాయి. వాసవీ విశ్వశాంతి మహా యజ్ఞాలు జరుగుతున్నాయి. ఆమె పేరు ఉచ్ఛరించిన నోరు బంగార మవుతుంచట. నిర్మలిన వాక్కులతో నిత్యపారాయణం చేయదగిన ఆమెచరిత్రను ఎవ్వరెంత వ్రాసినా తక్కువేమరి. ఆంధ్ర సారస్వత లోకంలో ఆమె నామం చిర స్మరణీయమైనదిగా చాటబడింది. వాసవీ దర్బార్ పేరుతో ఆమె చరిత్రము ఆమె చాటిన ధర్మసందేశాలు శుభోత్కరములుగా కొనియాడబడుతున్నాయి. టేపురికార్డులలోకి-రికార్డులలోకి కూడా. ఆ తల్లి చరిత్ర స్తూయమానంగా ఎక్కి ఆలాపిత మయింది. ఎన్నెన్ని కోణాలుగానో విస్తరించిన వాసవి కన్యకా చరిత్రము

నీవేవిధంగా సంభావించినా సరే అది నీకు మేలునే సమకూరు స్తుంది. ఐశ్వర్యవంతులైన వైశ్యులు ఆమె మూర్తిని బంగారు విగ్రహాలుగా చేయించుకొని పూజిస్తున్నారు. పూజించే ప్రతి వ్యక్తి సంపన్నుడే అవుతాడు, సుఖ శాంతులతో ఉంటాడు. సంతృప్త మానవుడవుతాడు. చిత్తములో త్యాగము ప్రవేశి స్తుంది. తర్వాత శాంతి లభిస్తుంది. "త్యాగాచ్ఛాంతి రనంతరం" అనే సదుక్తికి లక్ష్యంగా వాసవీ విరూపాక్షులు లోక జీవనానికే రెండు కన్నులుగా వెలుగుతారు. ఇతివృత్త ప్రధాన శోభితమైన వాసవి కన్యకా చరిత్రను నేను వెయ్యి పద్యాలుగా కావ్యాన్ని శాస్త్రవిధులకు లోబడి వ్రాసినాను. పద్య గేయాలతో అలరే, ఈ కావ్యాన్ని త్వరలో సారస్వత మిత్రలోకానికి అందించ బోతున్నాను. ఇంకా కొన్ని సందేహాలు నివృత్తి కావలసి ఉన్నది. అందుకే ఆపినాను. మన జీవన మూలాలన్ని ఆకాశ మందే ఉన్నాయి. అక్కడ సూక్ష్మంగా కదలే కదలికలే ఇక్కడి జీవనంగా భావిస్తున్నాను. నా కీ సందేహం త్వరలోనే తీరగల దనే నమ్మకముంది.

ఈ కథ మునికల్పిక మయింది. సందేహానికి తావులేదు. మారే వికృతిలోనైతం మారని ప్రకృతి ఉంటున్న రహస్యాన్ని గ్రహించినాను. మూల ప్రకృతి కెవరూ హాని చేయజాలరు.

అదే చైతన్యము. కదలీ కదలనిది. ద్వైదీబంధము. ఈఅమ్మ చరిత్రను పద్యాలుగా రచించినావు చాలా సంతోషము కాని పద్యాలందరికీ అర్థంకావు. ఆ కథాసారాన్ని ఆధునిక వచనంలో వ్రాస్తే అందరూ చదువుకొని ఆనందించడానికి వీలుంటుంది. ఆ కథను నేను అచ్చువేయిస్తాను అని ఆనందంగా శ్రీ కలశవాయి రాధాకృష్ణరావు గారు నాతో అన్నారు. ఆ మాట నన్ను తొలుస్తూ నిజమే ననిపించింది. ఈ కథాసృష్టి నాదికాదు. వ్యావహారిక భాషలో అర్థమయ్యే రీతిగా వ్రాయడం పని మాత్రమే చేసినాను. ఇది వారి సతీమణియైన కలశవాయి పుష్పావతిగారికి వాసవీ మహిళా సంఘాధ్యక్షురాలుగా ఉన్నప్పుడే కానుకగా ఇస్తానన్న నా వాగ్దానం నెరవేరడానికి ఆలస్యం నావల్లనే జరిగినది. అనేకములైన ఆటంకాలు అధిగమించకుండా శుభకార్యాలు నెరవేరవుకదా! ఆటంకాలు గట్టెక్కాయి. నగరంలో వైశ్యోత్తములచేత వాసవీ విశ్వశాంతి యజ్ఞం 13-7-83 నుంచి ప్రారంభమై 24-7-83 వరకు ముగియనున్నది. ఈ శుభ తరుణం బాగున్నది. ఈ లోపుగానే అమ్మవారి చరిత్ర అచ్చువేయిస్తే బాగుంటుందని శ్రీ కలశవాయి రాధాకృష్ణరావుగారిని కదలించినాను. మహదానందంగా చేద్దాము గురూ! అమ్మ చరిత్ర ప్రతి వైశ్యుడు చదివి తరించవలెనని అన్నారు. ఆ మేరకే ఈ గ్రంథం రూపొందింది. ఈ కథను వేల పుటలుగా వ్రాయవచ్చును. పది పుటల్లో

ముగించవచ్చు. ముఖ్యంగా అమ్మవారి కథను, ఆమె హితోక్తుల నిస్తూ పని పూర్తిచేసినాను. ఇవి అన్నీ నేను చెప్పినవి కావు. పూర్వంనుంచి ఉన్నవే. అవి మీరు తెలుసుకొనడానికి వీలుగా ఈ గ్రంథ రూపంలో మీ కందిస్తున్నాను. గురజాడ మహాకవి వ్రాసిన కన్యక గేయాన్ని ఇందులో పొందుపరచాను. వాసవీదేవి ప్రార్థనము, సరస్వతీ స్తుతి. — ఒక మంగళహారతి జతపరచి మీకీ గ్రంథం అందిస్తున్నాను. కృతిని కానుకగా తీసుకొని ఈ గ్రంథానికి వెలుగు త్రోవచూపిన శ్రీమతి కలువాయి పుష్పావతి గారికి నా ప్రత్యేక ధన్యవాదా లర్పిస్తున్నాను. పుష్పావతిగారి సంక్షిప్త పరిచయం ఈ గ్రంథంలో చోటు చేసుకొన్నది. వద వంది. వారి పతి జీవితం కూడా వారితో అనుబంధమై ఉన్నది. ఈ దంపతులకు సర్వేశ్వరుడు దీర్ఘాయురారోగ్య భాగ్యములు ప్రసాదించాలని పచ్చగా వారి కుటుంబాన్ని, బంధు వర్గాన్ని మిత్రతతిని కాపాడాలని అమ్మవారైన వాసవి కన్యకాపరమేశ్వరిని ప్రార్థిస్తున్నాను. 

ఈ నా సాహిత్య కృషికి ప్రోత్సాహమందిస్తున్న శ్రీయుత కె. సి. గుప్త (స్వాతంత్ర్య యోధులు - అణా గ్రంథమాలోద్యమ స్థాపకులు, అనేకసంస్థలను స్థాపించి నిలిపిన గుణాఢ్యులు) వారికీ, అందంగా అచ్చువేసి సకాలానికి అందించిన శ్రీ ఊట్ల కొండయ్య గారికీ, ముఖపత్ర రచన చేసిన శ్రీ శీలా వీర్రాజుగారికి నా ప్రత్యేక వందనాలర్పిస్తున్నాను. పాఠకలోక మాదరిస్తుందని ఆశిస్తున్నాను.



హైదరాబాదు
9-6-1983

సుకవిజన విధేయుడు
నీలా జంగయ్య

# కన్యక

తగటు బంగరుచీరె కట్టి
కురుల పువ్వులసరులు జుట్టి
నుదుట కుంకుమబొట్టు పెట్టి
సొంపు పెంపారన్

తొగల కాంతులు కనులు పరవగ
మించు తళుకులు నగలు నెరపగ
నడక లంచకు నడలు కరపగ
కన్నె పరతెంచెన్
రాజవీధిని

పసిడికడవల పాలు పెరుగులు
పళ్లెరమ్ముల పళ్లు పువ్వులు
మోములందున మొలకనవ్వులు
చెలగ చెలికత్తెల్
వెంట నడిచిరి

అంత పట్టపురాజు యెదురై
కన్నెసొగసుకు కన్ను చెదురై
మరునివాడికి గుండె బెదురై
యిట్లు తలపోసెన్

"ఔర ! చుక్కలనడుమ చందురు
నట్లు *వెలిగెను కన్నె ముందర
వన్నె కాంచిన నగరి సుందరు
లంద రొక లెక్క ?

పట్టవలెరా దీని బలిమిని
కొట్టవలెరా మరుని రాజ్యం
కట్టవలెరా గండపెండెం
రసికమండలిలో."

నాలనడును నట్టివీధిని
దుష్టమంత్రులు తాను పెండెం
గట్టి కన్నెను చుట్టి నరపతి
పట్ట నుంకించెన్

మట్టివచ్చిన దైవగతి కిక
దైవమే గతి యని తలంచుక
దిట్టనతమును బూని కన్నియ
నెట్ట నిటు పలికెన్.

"ముట్టబోకుడు దేవకార్యం
తీర్చి వచ్చెద, నీవు పట్టం
మేలు రాజువు - సెట్టికూతుర
నెటకు పోనేర్తున్?"

* [వెలిగెడి - శశిలేఖ]

చుట్టములు తనచుట్టు నిలవగ
భృత్యవర్గం కాచి కొలవగ
సెట్టి కరములు మోడ్చి రాజుకు
ఇట్లు వినిపించెన్,

"పట్ట మేలే రాజ ! బలిమిని
పట్టవలెనా ? నీదు సొమ్మే
కాద కన్నియ ? నీవు కోరుట
కన్న మరి కలదా
వైశ్యజాతికి వన్నె ?

గాని మన్నన జేసి మమ్ముల
బంధువర్గం కులంపెద్దల
ధర్మ మన్నది అరసి కొంచెం
దారి కనబడితే

అగ్నిసాక్షిగ కన్నె గైకొని
ఆదరించుము మమ్ము, కానుక
లందుకొమ్మెంతెంత వలసిన
మనుచు మా జాతిన్"

నవ్వి హేళననవ్వు, నరపతి
పల్కె "నోహో ! ధర్మమార్గం
పట్ట మేలే రాచబిడ్డకు
సెట్టి కరపడమా !

రాజు తలచిం దొను ధర్మం
రాజు చెప్పిం దెల్ల శాస్త్రం
రాజులకు పేరైన పద్ధతి
కాద గాంధర్వం ?

తడవు చెయ్యక తల్లిడిల్లిక
నేడు రేపని గడువుపెట్టక
నెమ్మి గోరితివేని, కన్నియ
నిమ్ము :
లేకుంటే పొమ్ము !

దేగ పిట్టనుపట్టి విడుచున ?
కన్నె యింటికి మరలి నడచున ?
తెమ్ము కానుక లిమ్ము నీ విటు
వచ్చినందాకన్

కవల” నంత నెట్టి పలికెను,
“దేవకార్యం ముందు, ఆవల
రాచకార్యం కాద రాజా !
శలవు నీ విస్తే

యింటి దైవం వీరభద్రుడి
దేవళానికి పోయి యిప్పుడె
పళ్లెరం సాగించి వత్తును
పైని తమ చిత్తం !”

"మంచిదే, మరి నడువు, మేము
తోడ వత్తుము - దేవళంలో
అగ్నిసాక్షిగ కన్యకను మే
మందుకొనగలము"

నాడు గుడిలో మండె గుండం
మంట [1]మింటిని ముట్టియాడగ
కన్న నరపతి గుండె దిగులై
పట్టు విడజొచ్చెన్

భక్తిపరవశమైన మనసున
దుర్గ నప్పుడు కొలిచి, కన్యక,
ముక్తి వేడుచు పూడ్చి నగలను
శక్తి కర్పించెన్

[2]కొలనున గ్రుంకి పిమ్మట
రక్తగంధం రక్తమాల్యం
దాల్చి గుండం చుట్టు నిలిచిన
జనుల కిట్లనియెన్ :

---

[1] మింటను [శశిలేఖ]

[2]కొలనుకు [శశిలేఖ]

"అన్నలారా! తండ్రులారా!
ఆలకించం డొక్క విన్నప
మాలుబిడ్డల [1]కాసుకొనుటకు
ఆశలే దొక్కొ
కులము లోపల?

పట్టమేలే రాజు అయితే
రాజు నేలే దైవ ముండదొ?
పరువు నిలపను పౌరుషము మీ
కేల కలుగదొకో?

విద్య నేర్చినవాడు విప్రుడు
వీర్య ముండినవాడు క్షత్రియు
డన్న పెద్దల ధర్మపద్ధతి
[2]మరచి పదవులకై

ఆశ చేయక, కాసు వీసం
కలిగి వుంటే చాలు ననుకొని
వీర్య మెరుగక, విద్య నేర్చక
బుద్ధి మాలినచో

కలగవా యిక్కట్లు? మేల్కొని
బుద్ధిబలమును. బాహుబలమును
పెంచి దైవమునందు భారం
వుంచి, రాజులతో

---

[1]కాసుకొనుటకు [శశిలేఖ] [2]మరిచి [శశిలేఖ]

రాజులై మనుశయ్యః!" ఇట్లని
కన్య నరపతి కప్పు డెదురై
నాలుగడుగులు [1]నడచి ముందుకు
పలికె నీ రీతిన్.

"పట్టపగలే, నట్టివీధిని
పట్టబో రే జార చోరులు
పట్టదలచితి వింక నీ వొక
పట్ట మేలే రాజు వటఁ

కండకావరమెక్కి నీ వీ
దుండగము తలపెట్టినందుకు
వుండదా వొక దైవమంటూ,
వుండి పూర్కొనునా?

కులంపెద్దలు కూడి రదుగో!
అగ్నిసాక్షికి అగ్ని అదుగో!
కన్నుకోరిన కన్నె యిదిగో!
జాల మే లొక్కొ?

[2]పట్ట మేలే రాజు వైతే
పట్టు నన్నిపు" డనుచు కన్యక
చుట్టుముట్టిన మంటలోనికి
మట్టి తా జనియెన్.

---

[1]నడిచి [శశిలేఖ] [2]పట్ట మేలే [శశిలేఖ]

పట్టమేలే రాజాగర్వం
మట్టి గలిసెను, కోట పేటలు
కూలి, నక్కల కాటపట్టై
అమరె.

యెక్కడైతే కన్య, మానం
కాచుకొనుటకు మంట గలిసెనో
అక్క డొక్కటి లేచె పొదము
ఆకసము పొడుగై.

పట్టమేలే రాజు పోయెను,
మట్టి కలిసెను కోట పేటలు
పదం పద్యం పట్టి నిలిచెను
కీర్తులపకీర్తుల్.

రచన :
ఆధునికాంధ్ర మహాకవి
గురజాడ అప్పారావు.

[ఆంధ్ర భారతి 1912 అక్టోబరు – నం. 3. సంపు

★ ★

# 'అగ్నిదీప్త'
# వాసవి కన్యకా చరిత్ర

"సనత్కుమార మౌనీంద్ర ప్రోక్తా పౌరాణికీం కథాం
జ్ఞాత్వా తదనుసారేణ వక్ష్యేహం వణిజాం కథాం"
[శ్రీ శాలంకాయన ప్రోక్తం — నుంచి]

నైమిశారణ్యంలో — సమస్త వైశ్యమునులు శాలంకాయన మునిని పరివేష్టించి ఆ మునిశ్రేష్ఠుడు వేదశాస్త్రాలలోని నిగూఢములయిన సంగతులను, ధర్మాలను శిష్యులకు బోధిస్తుండగా వింటూ చివరకు "ఓ మునీశ్వరా! మీవలన వేదాల యర్థాన్ని గ్రహించి తరించినాము. కాని, వంశానుక్రమంగా మాచే చేయబడిన పూజలను నగరేశ్వరస్వామి, జనార్దనస్వామి స్వీకరిస్తూ భూలోకాన వసిస్తున్న దెందులకో ఈ ఒక్క కారణం తెలియగోరుతున్నా మని వైశ్యమునులు [పదునెనిమిది పురాలకు ప్రభువులమై మేము] పెనుగొండ పట్టణ మెట్లు పొందితిమో ఆ సమస్తం సవిస్తరంగా వినగోరుతున్నా"మని అడిగినారు. ముని సంతోషించి "ఓ వైశ్యమునులారా! వినండి" అని యుగ ప్రమాణాలను ఆధారం చేసి ఆ యా దేవతల ఆయుఃస్థితిని తెలియపరచినమీదట జగదీశ్వరునిచే కలిగిన ముల్లోకాలు వాటిని పాలించే బ్రహ్మ విష్ణు మహేశ్వరులు త్రిగుణస్వరూపులై పుట్టి

సృష్టి స్థితి లయాలకు కారకులయిన సంగతులతోబాటు బ్రహ్మ సృష్టిని విశ్లేషించి తెలిపినాడు. బ్రహ్మదేవుని కుడితొడ నుంచి పుట్టిన వినయవంతులయిన ఏడువందల పద్నాలుగు వైశ్య కుమారులకు జాతక కర్మాదులు చేసి 64 విద్యలను తెలియచేసి యజనాధ్యయన దాన గోరక్షణాది కర్తవ్యవిధులతోబాటు క్రయ విక్రయాలు మొదలయిన బోధలను చేసి 12వ ఏట శరత్కాలమందు మంచిరోజున ఉపనయన మొసర్చి తన ఎడమతొడ నుంచి పుట్టిన కన్యలను ఈడు వరుసలు తగునట్లుగా వివాహాలు చేసినాడు. బ్రహ్మదేవుడు వైశ్యులను పుత్రులుగా దలచి కుమారులారా! మీరు భూలోకమందుండి శివానుగ్రహమువలన పాపం లేనివారై స్నేహసంపత్తితో చిరకాలం వర్ధిల్లాలని ఆజ్ఞాపించినాడు. ఆ వైశ్యులందరూ తండ్రియాజ్ఞ ననుసరించి భూలోకంలో గృహస్థధర్మాన్ని ఆచరిస్తూ ఆచారంలో పరోపకారులై వంశవృద్ధి కలిగి ఆనందంగా జీవిస్తూ ఉన్నారు. తపోధనులైనవారికే బ్రహ్మాదిలోక మావాసంగా జీవించ వీలుగలదని వైశ్యమునులు భూలోకంలో ఉన్న చక్కని వనాలను తపస్సు చేసికొనడానికి ఎన్నిక చేసికొన్నారు. సమస్త ఫల-పుష్ప-పత్ర శోభితాలైన తరు లతా గుల్మాదులు - మృగ శారికా కీరాది జీవసంతతులు కలిగి పరస్పరం విరోధాలులేని వినిర్మల వనవాసులైన కశ్యపాది మునుల సందర్శించి తమ కోరికలను నివేదించినారు. అహంకార రహితులై నిశ్చలబుద్ధి గల వైశ్యమునిజనం ఆ అరణ్యములందుండే సమస్త ఋషులకు గురుశిష్య భావుకతతో ఆత్మబంధువుల

వలె జీవించినారు. ఆ యా ఆశ్రమాలలో ఉన్న మునులకు జ్ఞాతులవలె ప్రేమాస్పదులై ఉన్నారు.

సాంబమూర్తిని, భూసంబంధంలేని జలంలో స్నానంచేసి పుట్టినట్టి బంగారు తామరపూలతో, పండ్లతో, వేడిలేని నిప్పుతో సుగంధ ధూపదీపాలను సమకూర్చి భక్తి శ్రద్ధలతో షడ్రసోపేత మైన నివేదనలతో అర్చించిరి. కొంతకాలము పండ్లు, కొంత కాలము నీరు, కొంతకాలము గాలి, కొంతకాలము తేజస్సును ఆహారంగా చేసికొని జీవిస్తూ, చిట్టచివరకు నిరాహారులై వైశ్య మునులు శివునిగోరి ఘోరమైన తపస్సులు చేసినారు. వర్షా కాలంలో చెట్లక్రింద, శీతకాలంలో నీళ్ళలో, ఉష్ణకాలంలో పర్వత శిఖరాలపై ఉండి ప్రకృతిని జయించి తపస్సు లాచరించిరి. పరమేశ్వరుడు వైశ్యుల తపస్సును మెచ్చి ప్రమధగణాలతో అర్ధనారీశ్వరాకృతితో ప్రత్యక్షమై "కుమారులారా! మీ భక్తికి మెచ్చి యేతెంచితిమి. మీరేమి కోరెదరో కోరండి" అని సెల వీయగా ఆ వైశ్యమునులు "జగదీశా! భక్తవత్సలా! సతీ సమేతంగా మా మనస్సు లెప్పుడూ తమను సేవించే విధంగా వరమిచ్చి సదా మీ సాన్నిధ్యము కల్పించ"మని త్రికరణశుద్ధిగా ప్రార్థించినారు. ఈశ్వరుడు వైశ్యమునులు గావించిన తపస్సు నకు, ప్రార్థనకు మెచ్చి కైలాసమునకు వెంట తీసుకొని పోయి వారి నక్కడ స్థిరనివాసులుగా ఉండునట్టు లనుగ్రహించినాడు. చాలాకాలము శివసాన్నిధ్యంలో ఆనందం అనుభవించిన వైశ్యులు

శివుని ప్రేరణచే భూలోకానికెట్లు తిరిగి రావలసివచ్చెనో ఆ కథను కూడా ఇట్లు చెప్పెను.

సాంబశివుడు లోకరక్షణార్థం పార్వతిని పెండ్లియాడిన పిదప విష్ణ్వాది దేవతలతో ఉండి యక్ష రాక్షస గంధర్వ సిద్ధ విద్యాధరాది ప్రమథ గణాలచే, బ్రహ్మాది మునులచే, మహర్షులచే, కుమారస్వామి విఘ్నేశ్వరాదులచే, అప్సరాది గణాలచే కొలువబడి కైలాసంలో ఉండి ఒకనాడు భూలోకంలోని భక్తుల పరిస్థితిని పరికించవలచి వారిని అనుగ్రహించే లక్ష్యంతో మర్త్యలోకానికి విచ్చేసినాడు.

మానవులేల నన్ను కానుకల సమర్పించి ప్రస్తుతించుట లేదు విచారింపుమని కుబేరుణ్ణి అడుగగా స్నేహితుడైన కుబేరుడు శివునితో ఇట్లా అన్నాడు. స్వామీ వైశ్యులందరు నీ సన్నిధానంలో నిన్నే అనుభవిస్తూ ఆనందంగా ఉన్నారు. భూలోకము సంపన్నహీనమై శుష్కమై కనపడుతున్నదని విన్నవించగా పరమశివుడు సత్యాన్ని గ్రహించి కైలాసవాసులైన వైశ్యోత్తములతో బిడ్డలార! మీరులేని భూలోకము ధనహీనమై ధర్మహీనమై కళావిహీనమైనది కాబట్టి మీరిక భూలోకవాసం చేసి నాయందఖండమైన భక్తిశ్రద్ధలు కలిగి సకలైశ్వర్య శోభితులై అలరారండి అని ఆజ్ఞాపించగా, స్వామీ! మాణిక్యాన్ని ఎడబాసి గవ్వ నాశ్రయించినట్లు కైలాసాన్ని వీడి భూలోకాన్ని మేమేమి చేసుకొంటామని ప్రార్థించినారు. అందుకు శివుడిట్లా అన్నాడు. భక్తులార! సూర్యాదిదేవతలు లోకోపకారంకోసం సంచారమెట్లు

చేస్తున్నారో అట్లాగే మీరుకూ భూలోకమునకు వెళ్ళి అట్లా చేయ వలసినదని మీరుండుచోటనే నేనుకూడా ఉందునని మీ ఇలవేల్పు లముగా నేనునూ పార్వతియునూ కాగలమని సంకోచించక వెళ్ల దని-నేను నగరేశ్వరనామంతో, పార్వతి వింధ్యవాసిని నామంతో ఉభయులం భూమిలో మీరు కావించే పూజలందుకొందుమని చెప్పగా వృషభేశ్వరుని కుడిచెవి మార్గంగా పురుషులు ఎడమచెవి మార్గంగా స్త్రీలు బయలుదేరి బ్రహ్మదేవుణ్ణి సమీపించి ఓ జనకా! మమ్ములను ఈశ్వరుడు మర్త్యలోకవాసులై సుఖానందాలతో ఉండి నన్ను సేవించుడని ఆజ్ఞాపించి పంపెనని పలుకగా బ్రహ్మ దేవుడు విని వైశ్యులతో బిడ్డలార! నేనేకాదు విష్ణ్వాది దేవతలు సమస్తము శివాజ్ఞ తలదాల్తురు. మీరు ఆనందంగా భూలోకానికి వెళ్ళండి మీకు మంగళమే సిద్ధించునని ఆజ్ఞలిడెను. వెంటనే వైకుంఠమునకు వైశ్యులు వెళ్ళి విష్ణుమూర్తిని దర్శించి దయా కరా! వరదా! అని సంబోధించి స్తుతిసల్పి నమస్కరించిన వైశ్య మునిసత్తములను విష్ణుమూర్తి చూసి సంగతి గ్రహించి భక్తు లార! శివసంకల్పము ఎవరికీ అలంఘ్యము కావున మీరు భూలోక మేగండి నిర్ధనమై నిర్వీర్యమై నిస్తేజమై కళాహీనమైన భూమిని మణిమాణిక్య స్వర్ణాదులతో సుసంపన్నం చేయడానికి మీరక్కడ నిలువక తప్పదు. నా ఆజ్ఞచేత లక్ష్మీదేవి కోనకమలగా- బ్రహ్మాంశ సంభూతుడుగా భాస్కరాచార్యుడు, నేను జనార్దను డుగా నిలుతుము. నా యాజ్ఞచే విశ్వకర్మ మీరు వసించుటకు తగిన నగరాలను గృహాలను నిర్మించి ఇచ్చుటకు ఆజ్ఞాపించెదను. మీకు సహాయుడనై బలి నెట్లు కాపాడితినో అంతకన్న

మిన్నగా మిమ్ములను కాపాడెదనని విష్ణువు వైశ్యమునులతో చెప్పెను.

దయానిధియైన నారాయణమూర్తి ఆజ్ఞ ననుసరించి అఖండ భూమండలంలో విశేషనివాసమనదగిన ఆంధ్రదేశంలో గోదావరీ నదీతీరమున గల నొక వనప్రదేశంలో విమానముల నుంచి దిగివచ్చిన వైశ్యమునులు ఒక అపూర్వమైన సరస్సును చూసినారు.

తరంగ డోలికలలో ఊయలలూగే హంససమూహాన్ని మనోహరముగా వికసించిన పద్మాలలోని మకరందాన్ని అనుభవించి ఝుంకారాలుచేయు తుమ్మెదలతోను ఒప్పారే ఆ సరస్సులో ఒకేతూడునకు మూడుపూవులు కలిగిఉన్న ఈ విశేషాన్ని ఆశ్చర్యంగా తిలకించి ఆ వైశ్యమునులు తండ్రియైన బ్రహ్మను సాక్షాత్కారం చేసుకొని నివేదించిరి. అప్పుడా బ్రహ్మదేవుడు-

ఓ వైశ్యోత్తములార !

పూర్వము పులస్త్యుడు సర్వశ్రేయార్థం మహాయజ్ఞము చేసినాడు. ఆ యజ్ఞంలో హోమగుండమున త్రిమూర్తులము ప్రవేశించినాము. పద్మమూలములో తేజోరూపమగు లింగస్వరూపాన్ని నిర్మించితిమి. మూలస్థానేశ్వరంగా సమస్తదేవతలు కొనియాడే ఈ సరస్సులోని ఒకే తూడునకు మూడు పువ్వులముగా అలరారితిమి. ఆ హోమకుండమే ఈ సరస్సు. జ్వాలలే జలము. ఈ పులస్త్యతీర్థము మహాపవిత్రమైనది. అందుకే సమస్తమును

లి తీర్థాన్ని సేవింతురు. ఈ ప్రదేశముననే మీరు నివసించే యోగ్యమయిన నగరం నిర్మింపబడగలదని బ్రహ్మ విశ్వకర్మ వైపు తిలకించినంతనే విశ్వకర్మ బ్రహ్మసంకల్పాన్ని గ్రహించి అతని ఆజ్ఞగా నెంచి బలయుక్తమయిన లగ్నమున గ్రహాదులు కేంద్రమందుండగా వాస్తు శాస్త్రానుసారం పన్నెండు సూర్య వీధులు పదునారు చంద్రవీధులు ఉండే విధంగా శంకుస్థాపనచేసి పురమును నిర్మించెను. ఆ పురములో అనేకములైన సుందరము లగు మేడలు పుర ద్వారములు లోహములతో రాతితో ప్రాకారా లను విస్తారమయిన నీరు గలిగే లోతయిన కందకాలను మనోహ రాలయిన మండపాలు కలిగిన దేవళాలను విమానములతో కూడిన మేడలపై అంతస్థులను జలక్రీడల కనుకూలమైన దిగుడుబావు లను ఫలపుష్ప శోభితములైన ఉద్యానాలను చక్కని అగ్నివేది కలు గల గృహాలను నిర్మించెను. అలకాపురాన్ని పరిహసించే విధంగా పురాన్ని నిర్మించి మధ్యభాగంలో వైశ్యులను వారికి పడమట బ్రాహ్మణులను తూర్పున క్షత్రియులను దక్షిణోత్తర భాగాలలో శూద్రులను నిలిపి ఆ పురంలో అలంకారయుక్తమైన చిత్రాలను శిల్పాలను నిలిపినాడు.

ఆ పట్టణపు ప్రాకారాలైదింటిచుట్టూ ప్రదక్షిణ చేసిన పుణ్యాత్ములు నాలుగు సముద్రాల నడుమగల భూ ప్రదక్షిణ చేసిన ఫలాన్ని అనుభవించినవారగుటేకాక కొబ్బరితోటలతో పనస వృక్షాలతో చెరకు తోటలతో నయనపర్వమై నగరము శోభించెను. సదాచార సంపన్నమైన ఆ పురములో గోశాలలు- గజశాలలు - అశ్వశాల లెన్నో కలిగి చూపరులకు విభ్రాంతి

గొలుపుచుండెను. తూర్పుదిశన గోదావరి దక్షిణమున లవణ సముద్రము పడమట గోస్తనీ నది ఉత్తరమున వాసిష్ఠ యనే గోదావరీశాఖయు ఉనరాయుచున్నది.

కైలాసం కుబేరునివలన ఎట్లు ఐశ్వర్యభరితమైనదో అట్లాగే ఈ పురమందు వసించిన వైశ్యులుకూడా సుసంపన్న భరితులై పాలసంద్రంలో లక్ష్మీదేవి సంచారము చేయుచున్నదో అన్నట్లుండిరి.

పార్వతికి జన్మకారణంబైన హిమాలయమువలె వైశ్యుల కా పట్టణము జన్మస్థానమైనది. ఈ నగరము రోహణ పర్వతమువలె మణిగణాలతో తేజరిల్లినది.

సకలార్థములను అడిగినవారికిచ్చే దాతలతోను కల్పవృక్షములవలె నిరంతరము ఫలపుష్పాలతో ప్రకాశించే అరటిచెట్లతోను కూడి స్వర్గమే యన ఈ పురము ప్రకాశించినది.

విశాల భూభాగాన్ని ఆవరించిన ఈ నగరము అనేకములైన కొండలకు నిలయమై వైశ్యవంశాలకు ఆవాసమై ఉండటం వల్ల అది పెనుగొండ అనేపేర వర్ధిల్లునని ఈ విధముగా విశ్వకర్మ బ్రహ్మ ఆజ్ఞగా నిర్మించి చెప్పెను. ఈ నగరాన నివసించే వారికి భోగోపయోగానికి మరి పదినేడు గ్రామాలను నిర్మించి వానికి ఘంటసాల, ఆచంట. ధనదము, శివకోడు, ధర్మపురి, దెందులూరు, ఏలూరు, నగరవాటిక, పాలకొల్లు, నరసాపురము, విశాఖపట్టణము, త్రిగుణితపురము, భీమునిపట్టణము, వీరనారాయణపురము, జగన్నాథపురము, కళింగపట్టణము లనే నామము

లతో ఏర్పాటు చెను. ఈ పట్టణములలో కూడా వైశ్యవర్యులను ప్రతిష్ఠించెను. కుబేరుడు ఆ యా అంశాలతో వైశ్యులకు ధనమును ప్రసాదించి క్రయవిక్రయాదివ్యాపారాలను యుగధర్మాన్ని అనుసరించి ఎట్లు సాగింపవలయునో ఆ యా ధర్మముల నెల్ల ఉపదేశించి తగిన ఆచారాలను విడవరాదని, దేవతలయందు - సజ్జనులయందు భక్తి కలిగి ఉండటమేగాక అతిథి మర్యాదలతో సత్యసంధులై మెలగుడని చెప్పి విశ్వకర్మతోగూడ అంతర్ధానులయిరి.

పార్వతీ పరమేశ్వరులు వింధ్యవాసినీ నగరేశ్వరులుగా, లక్ష్మీనారాయణులు కోనకమల జనార్దనులుగా నగరమున నిలిచిరి. నగరవాసులు చేయు నిత్యోత్సవ, మాసోత్సవ, ఋతూత్సవ, వర్షోత్సవాల నందుకొనుచుండిరి. గ్రామదేవత లయిన దుర్గ, భైరవుడు, వినాయకాదులు ప్రజల పూజలంది కాపాడుచుండగా, బ్రహ్మాంశమున పుట్టిన భాస్కరాచార్యుడు వైశ్యులకు సమస్త ధర్మాల నుపదేశిస్తూ పురోహితుడై మెలగుచుండెను. ఈ విధంగా పదునెనిమిది పట్టణాలలో నివసిస్తున్న వైశ్యులు వంశ గౌరవ మర్యాదలను కాపాడుకొనుచు ధర్మమార్గాన్ని తప్పనివారై కృత, త్రేతా, ద్వాపరయుగాలలో సంతోషంతో వ్యాపారాలు చేసి అఖండ భోగ భాగ్యాలతో నలరారిరి. కలియుగంలో మాత్రం కొంతకాలం గడిచినపిదప వైశ్యకులంలో పుట్టిన కన్యక మూలంగా వృద్ధులు, వారి భార్యలు అగ్నిప్రవేశం చేసి మోక్షాన్ని పొందటమేగాక వారిసంతానము సమస్త భూమండలంలో వ్యాప్తి పొంది ధన ధాన్య వస్తు సౌభాగ్యాలలో వర్ధిల్లి

తరింతునని శాలంకాయన ముని చెప్పగా వైశ్యమునులు విని సంతోషించి "స్వామీ! కలియుగంలో ఏ కారణంవల్ల కన్యక మూలంగా వైశ్యవృద్ధులు అగ్నిప్రవేశం చేసి చరిత్ర నిలుపు కొంటారో ఆ జరుగబోయే విషయాన్ని కూడా తెలిపి మమ్ముల ధన్యుల జేయు"దని వైశ్యమునులు కోరిరి. అందుకు సంతోషాంతరంగుడై శాలంకాయన ముని వైశ్యమునులతో ఇట్లు తెల్పెను.

పెనుగొండలో నిలిచిన నగరేశ్వరస్వామి, జనార్దనస్వామి మహిమాతిశయంతో పురోహితుడయిన భాస్కరాచార్యులతో వైశ్యులు యజన, అధ్యయన, దాన, కృషి, వాణిజ్య, గోరక్షణాది ప్రవృత్తులు కలిగి సుఖప్రదంగా నుండిరి ఇట్లు కొంతకాలం గడిచిన తరువాత పాలసముద్రంలో చంద్రుడు పుట్టినట్లు కుసుమ శ్రేష్ఠి అను ఒక వైశ్యశిఖామణి పుట్టెను. ప్రభాతగోత్రమున పుట్టిన ఈ కుసుమశ్రేష్ఠి లావణ్యము చేతను, తేజస్సుచేతను చెన్నారుచుండెను. కుసుమాంబ అను పేరుగల సద్గుణరాశితో వివాహమై వైశ్యజనోచితము లయిన ధర్మముల నాచరిస్తూ అంతులేని సౌభాగ్యాలతో అలరారెను. లేదన్న దొక్క సంతానం తప్ప వేరేమియు లేని విశేషాలతో ఒప్పుచుండెను.

బాల్యమాదిగ గొప్ప శివభక్తులై అలరారిన ఈ దంపతులకు మొదట - కుసుమాంబికకు కావేరి అని, కుసుమ శ్రేష్ఠికి వాసవుడు అని పేర్లు ఉండెను. శివుని కోసం విశాలమగు పూదోటను నిర్మించుటచేత ఈ పేర్లు - కుసుమాంబ కుసుమశ్రేష్ఠులుగా

ప్రసిద్ధమయ్యేను. సంతానము లేని చింత యొక్కచే ఆ దంపతు లను వేధించినదై యుండగా ఎన్నెన్నో పూజలు జపాలు తపాలు దానధర్మాలు చేసిరికాని ఆ లేమి తీరకట్టులే కొనసాగెను.

సకల సౌభాగ్యా లున్నవారికి సంతానం లేకుండచేసి అష్ట దారిద్ర్యాన్ని అనుభవించే నిరుపేదలకు కవలసంతాన మిచ్చే ఆ భగవంతుని చేష్టను సంభావిస్తూ ఆ దంపతులు ఒక్కొక్క మారు విచారంతో చేయునదిలేక నిశ్చేష్టు లవుతుండగా ఒకనాడు కులగురువయిన భాస్కరాచార్యులు వారి విచారమును వేదవిహి తంగా సంభావించెను. పుత్రకామేష్ఠి క్రతువు మనస్సులో మెదిలి ఆ యాగమును నిర్వహించమని కుసుమదంపతులకు వివరించెను. తొల్లి దశరథాదులు సంతానం కోసం ఈ యాగాన్ని ఆచరించిన ఉదాహరణ లిచ్చెను. అందు కా దంపతులు సంతసించి వెంటనే ఆ క్రతువు నిర్వర్తించ దలచి భాస్కరాచార్యులతో సుముహూర్త మును నిర్ణయించిరి.

## పుత్రకామేష్ఠి యజ్ఞము

పుత్ర కామేష్ఠి క్రతు నిర్వహణకు నగర మలంకరింప బడెను. యజ్ఞశాల రూపొందెను. దేశంలోని సమస్త దేశ పండి తులను, ఋత్విక్కులను, పౌరాణికులను రావించిరి. అనేకమంది రాజులకు, సామంతులకు, కవులకు, పండితులకు, పురోహితు లకు, బంధుమిత్రాదులకు, ప్రముఖులకు శుభలేఖలు పంపించిరి. భాస్కరాచార్యులు బ్రహ్మగా నిలిచి యజ్ఞము ప్రారంభించెను.

కుసుమాంబా కుసుమశ్రేష్ఠులు యజ్ఞమున కేతెంచిన వారందరికీ మ్రొక్కి ఆశీస్సులందిరి. ఏడు దినములు ఏ అంతరాయములు లేకుండా యజ్ఞము కొనసాగెను. సమస్త దేవతలీ క్రతువుచే తృప్తులయిరి. పరమేశ్వరు డానందించి పార్వతితో ఇట్లనెను. "ఓ దేవీ! ఈ దంపతులు నీ ఉపాసనలో అచంచలమయిన భక్తి భావము కుదిరినవారు. వారిని సంతానయుతుల్ని చేయ" మని సెలవిచ్చెను. కరుణామయి అయిన పార్వతీదేవి యజ్ఞమండపమున ప్రత్యక్షమై రెండు కల్పక ఫలాలను దంపతులకు ప్రసాదించి అదృశ్యమయింది. దేవతలు పూలవాన గురిపించిరి. యజ్ఞము సాఫల్యమై ముగిసెను. ఆ దంపతులు యజ్ఞాంత దినమున సమస్త ఋత్విజులను, కవిపండితులను, కళారాధకులను సముచితంగా సత్కరించి దేవి అనుగ్రహాన పొందిన ఆ కల్పక ఫలాలను కన్నుల కద్దుకొని మహాభక్తితో భుజించిరి. కుసుమాంబ గర్భమును దాల్చి నవమాసములు మోసెను. వైశాఖ శుద్ధ దశమీ సాయంత్రమున శ్రవణా నక్షత్రమున సమస్తగ్రహములు ఉచ్చస్థానంలో ఉండగా కుసుమాంబిక ఒక పుత్రుని, ఒక పుత్రికను కవలుగా కన్నది. ఆ పుత్రిక పుట్టుట తోడనే ఆ తల్లిదండ్రులకు దివ్యరూప సాక్షాత్కారము చూపెను. నాలుగు చేతులు కలిగి ఒక చేతిలో పాశము, మరొక్క చేతిలో పద్మము, తక్కిన రెండు చేతులలో చిలుక, వీణెయు కలిగి పదునారు కళలు రాశిగా బంగారురంగు కలదై పీతాంబరధారియై సహజ కుండలాలు కలదిగా పుట్టిన భవనంలో ఆ కుసుమదంపతులకు తన దివ్యరూపమును చూపించెను. ఆ దేవి మహిమను కన్నులార

దర్శించిన ఆ దంపతులు ఆనందసాగరాన మునిగి తేలినవారై ఆ దేవికి నమస్కరించిరి. అంత తన దివ్యరూమును చాలించి శిశువుగా మారిన ఆ పుత్రికను సామాన్యురాలుగా ఎంచక అపర పార్వతిగా భావించిరి. వసు రూప లావణ్యాలతో విరాజిల్లుచున్నది కాన 'వాసవి' అని పుత్రికకు, సమస్త సంపదలకు కారణకర్త యైన పరమేశ్వరుని దయచే జనించిన కుమారునికి 'విరూపాక్షు' డనియు జాతకర్మ సందర్భమున పేర్లు పెట్టిరి. బంగరుటూయ లలో ముత్తయిదువలు పాటలు బాడ ఆ బిడ్డలు శుక్లపక్ష చంద్రుడివలె దినదినము వృద్ధిపొంది బాల్యాదులు గడిపి ఆయా విద్యలు నభ్యసించి యౌవన రూపసౌందర్యాలు పొందిరి. వాసవి, కన్యక అయినది. నిరంతర శివపూజాదులతో కాలమును హరించుచేగాక చక్కని కంఠముతో నామె వీణ వాయించుతూ స్తోత్రములను పాడుతూ ఆదిదంపతులయిన పార్వతీ పరమేశ్వరు లను ఆరాధించెడిది. ఆమె వీణాగానములకు పరవశించిపోని ప్రకృతియే లేదన రాణించెను. కన్యాత్వమందే విశేషకీర్తి నార్జిం చుటచే నామె కీర్తికన్య అనే బిరుదుతో సార్థకమై ఆ కీర్తి దశ దిశల ప్రాకెను. ఆ నగరంలో నివసించే ప్రతి మానవుడు విద్యా ధన సంపదలతో తులతూగుతూ సముద్రప్రయాణాలు చేయుచు వ్యాపారరంగమున ఎనలేని ఖ్యాతి బడసెను. ఆ యా పశు మృగ పక్షిగణాలు పరస్పరానురాగ జీవనంచేస్తూ సుభిక్షంతో కాలమును దాటుచుండగా, ఆ వాసవీ కన్యక కుసుమదంపతుల రత్నమంది రంలో జీవరత్నంగా వరలుచున్నది. బాలనగరులలో గౌరవ

బాలికగా బాలికల నాదరించుచు చూపరుల నా దివ్యతేజస్సుతో భక్తితత్పరులను గావించుచుండగా ఒక్కనాడు —

మార్కండేయేశ్వరస్వామి కావాసమయిన రాజమహేంద్రమనే పురం పవిత్ర గోదావరీ జల ప్రవాహాలతో సుపవిత్రమై సమున్నతాలయిన ప్రాకారాలతో చిత్రాతిచిత్రాలయిన గోపురాలతో చంద్రశాల లనబడే అంతస్తులతో ఒప్పిన మేడలతో శిల్పకళాపై భవాల దెల్పు దేవళాలతో విశాలమయిన మండపాలతో జలక్రీడా వినోదాలు చేయుట కనువయిన దిగుడు బావులతో అనేక ఫలపుష్పాలం గూడిన ఉద్యానాలతో నవరత్న, వస్త్రాద్యమూల్యంబులైన వస్తువిక్రయశాలలతో రాజమహేంద్రము మహేంద్రపురాన్ని సైతం వెక్కిరిస్తున్నదో అన్నట్లుగా ప్రకాశించుచుండెను. గజ, తురగ, భటాది బలాలతో సంగీత, నృత్య గాన వినోదాలతో వయారముల జిందు వేశ్యాంగనలతో మనోహరాలైన క్రీడాసదనాలతో చెన్నలరే ఆ పట్టణాన్ని చాళుక్య వంశ వర్ధనుడైన విష్ణువర్ధనుడనే రాజు రాజధానిగా చేసుకొని చంద్రవంశరాజ చూడామణిగా అర్జునున కేడవతరమువాడన చెలగి సువిశాల భూభాగాన్ని పాలిస్తున్నాడు.

ఒక్కనాడా విష్ణువర్ధనుడు నిజరాజసౌధాంతరంలో మనోహరంబైన నవరత్నఖచిత సింహాసనస్థుడై సమర్థులైన మంత్రి పురోహిత వీర జ్యోతిష విద్యా బుద్ధిసంపన్నులైన ముఖ్యాతి ముఖ్యులతో కూడి దిగ్విజయాకాంక్ష ప్రస్తావన చేసి ఆ సభలో 'దిగ్విజయాత్ర చేయు సంకల్పాన్ని' వివరించి నిర్ణయించెను.

విష్ణువర్ధనుడు దిగ్విజయయాత్రకు జ్యోతిష్కులతో విజయకరమైన ముహూర్తాన్ని పెట్టించి ఆ ముహూర్తంలో ప్రయాణభేరి మ్రోగింపచేసినాడు. ఆ చప్పుడు భువనభోంతరాళాలను ఛేదించునదై యున్నది. ఆలకించిన రాజులు నానాదేశాల నుంచి తమతమ సైన్యాలతో కూడి రాజమహేంద్రాన్ని చేరినారు. మంగళదేవతల నారాధించినారు. ప్రయాణ శుభకృత్యాలను శకునాలను ఆచరించి విష్ణువర్ధనుడు విజయాశ్వ మధిరోహించినాడు. వాయువేగాన విజయపథాన్ని అనుసరించి సాగగా అలంకరింపబడిన రథాలు ఉత్తమాశ్వకదళం మదపుటేనుగుల దళం యోధాగ్రేసరులైన కాల్బలం విష్ణువర్ధనుని యాజ్ఞలం గూడి దిగ్విజయ యాత్ర సాగించి ధ్వజములు రెపరెపలాడుతూ చూపరుల నుత్సాహజనితుల గావించుచుండెను. ఆ రాజు చతురంగ బలాలతో సాగుతున్నప్పుడు పైకెగసే భూపరాగము ముప్పిరిగా గగనమండలాన్ని గప్పివైచెను. కొందరు రాజులు విష్ణువర్ధనుని పరాక్రమ మాకర్ణించి యమూల్య వస్తుకానుకల నొసగి శరణమనిరి. పాంచాల, పాండ్య రాజ్యాల గెలిచి లాటదేశాన్ని వశం గావించుకొని కళింగుల నోడించి తన ననుసరించునట్లు చేసి దశార్ణ దేశాలకు బోయి వారిని సముద్రతీరాలకు తరిమి వరసగా యవన, కుంతల, ఘూర్జర దేశాలను చుట్టి ఆ రాజుల నుక్కడగించి వధించి మరికొందరు పలాయనము చిత్తగించుచుండగా పీరవిహారుడై సముద్రదీపవాసుల నోడలతో జయించి వనదుర్గముల దాసి వాడి గొడ్డండ్లతో ఇతరాయుధాలతో వనాలను విధ్వంసం గావిస్తూ దుర్గాధిపులను మట్టుపెట్టడమే గాక పర్వత

దుర్గాలను ముట్టడించి యగ్నియంత్రాలతో కాల్చి శిలాయంత్రాలతో కూల్చి దవ్వుగా పోయే అనేకవిధాలైన ఆయుధాలను శబ్దభేదన చాతుర్యంతో ప్రయోగించి దుర్గాలన్నిటినీ ఛిన్నాభిన్నము చేసి ఆ రాజులందరినీ చంపి వారి కుమారులను తండ్రుల స్థానాలలో నిలిపి క్రమంగా మంగళగిరివైపు సాగినాడు. బాహుబల సంపన్నుడైన కల్యాణపట్టణప్రభువు తన సామంతరాజులతో కూడి విష్ణువర్ధనుణ్ణి యెదుర్కొన్నాడు. పోరు ఘోరతరమయ్యింది. ద్వంద్వయుద్ధంలో ఇరువురి సైన్యాలు గజతురగాలు చాలా నశించిపోయినవి. విష్ణువర్ధనుని సైన్యం వెరచి దీనస్వనం చేస్తూ వెనుతిరిగి పారుట చూసి క్రోధావేశంతో ఉగ్రచండముగా యుద్ధము చేయడానికి తన సేనలను పురికొల్పెను. చిట్టచివరకు కల్యాణపురాధిపుడు విష్ణువర్ధనుని ధాటికి తాళలేక భయభ్రాంతుడై ఎన్నో రత్నములను కానుకలుగా సమర్పించి శరణాగతుడైనాడు. ఆతణ్ణి అనుగ్రహించినాడు.

ఈవిధంగా చేసిన దిగ్విజయయాత్రలో విష్ణువర్ధనుడు సమస్తదేశనాధులు ప్రస్తుతింపవచ్చు మార్గంలో కృష్ణానదిని చూసినాడు. ఆ నదికి నమస్కరించి స్నానదానాదులు చేసి ఆ తీరంలో కనువిందు చేస్తున్న ఇంద్రకీలాచలాన్ని చూసినాడు. చరిత్ర గల ఆ పర్వతాన్ని అధిరోహించినాడు. తన పూర్వులైన ధర్మరాజాదుల నలరించిన పర్వతం. అర్జునుడా పర్వతంలో తీర్థయాత్రలు చేస్తున్న సందర్భంలో కొంతకాలం నివాసంగా ఉన్నాడు. అవి యన్నియు తలచుకొనుచూ ఇంద్రకీలాచలాన్ని

సంస్తుతిస్తూ దిగ్విజయయాత్ర యిక సమాప్తమయ్యేనని సంతో షిస్తూ రాజమహేంద్రపురాన్ని చేరుటకు వెనుదిరుగు ప్రయాణంలో పెనుగొండపురాన్ని సమీపించి చెంతనున్న సుందరోద్యానంలో ప్రవేశించినాడు. నానావిధ ఫలపుష్పశోభలతో చక్కని వాదలతో మార్గములతో ఉన్న ఆ తోటలో ఒకచోట కొందరు ఫలములను ఆరగించుచూ మరోచోట సరససల్లాపములతో కొందరు కాలక్షేపము చేయుచూ ఫలపుష్పాదులు త్రెంపుచూ బ్రహ్మచారులు సంచరించుచున్నది గమనించినాడు. కొండొక చోట వేదశాస్త్ర పురాణాది విద్యలు నేర్చే శిష్యులు నేర్పే గురువులు కలసి ఉండటం తిలకించినాడు. ఒకవంక జ్యోతిషము చదివే విద్యార్థులు, మరోవంక వేదములను వల్లించు విద్యార్థులు, ఇంకోవంక గణితము నేర్చే విద్యార్థులు, మరోవైపు వ్యాకరణ ఛందశ్శాస్త్రిలు, ఇంకోచోట కావ్యనాటక లక్షణాదులు మరో దిక్కు అలంకారికాది శాస్త్రిలు నేర్చే విద్యార్థులను చూసి విష్ణు వర్ధనుడు మహా ఆనందాన్ని ఆశ్చర్యాన్ని పొందినాడు.

ఆ వనంలో స్వర్ణమయమయిన, రత్నఖచితమయిన ఒక దివ్యసౌధాన్ని చూసినాడు. నాలుగు ప్రధాన ద్వారాలపై ఉంచబడిన పసిడికుండలతో ప్రకాశించే ఆ మహాసౌందర్య సౌధాన్ని మేరుశిఖరమో అన్నట్లు దర్శించ సాగెను, ఆ విష్ణువర్ధనుడా మేడ నధిష్ఠించి అందలి రమ్యమయిన తావులు పరికించి మాణిక్యమయ మయిన నొక దివ్యాసనమున కూర్చుండగా- పెనుకొండనగర వైశ్యు లేతెంచి ఉద్యానవన విశేషాల నెరిగించు

చుండగా వినుచు మార్గాయాసాన్ని తీర్చుకొనెను. ఆ తరవాత లోకమనోహర మయిన పెనుగొండను చూసి మహదానందంతో ఆ పురవై భవాన్ని తనలో గొప్పగా సంభావించెను. సకల సౌభాగ్యవిలసితమై పవిత్రమై ఈ పురము వైకుంఠ మన నొప్పు చున్నది. ఆహా! ఏమి ఈ వైశ్యుల అదృష్టం అని సంతోషించి తన రాకను కుసుమశ్రేష్ఠికి తెలియపరచగా, కుసుమశ్రేష్ఠి తన మంత్రులతో వచ్చి విష్ణువర్ధన రాజును దర్శించి కానుకల నర్పించి యథోచిత సత్కారాలు కావించినాడు. తోటలోని ఆ సుందరభవనంలో రారాజు ఆనందించేవిధంగా తగిన ఏర్పాట్లు కావింప చేసినాడు. యుద్ధబడలికను తీర్చుకొని ఒక్కరోజు అందు గడిపి తన రాజధానికి వెళ్ళేసమయంలో రారాజునకు కుసుమ శ్రేష్ఠి వీడ్కోలు సన్మానము ఏర్పాటు చేయ నిశ్చయించి తన రాజ్యములో లభించే అమూల్య వస్త్రాభరణాలను, రత్నాలను విష్ణువర్ధనుని సత్కారానికి సిద్ధము చేయించెను. గౌర బాలికలతో విష్ణువర్ధనునకు మంగళనీరాజనము లిచ్చే ఏర్పాట్లు కూడా చేసి నాడు. గౌరబాలికలలో ఒకతె పెద్దవయిన తన కూతురు వాసవి కన్యకామణితో విష్ణువర్ధనునకు మంగళగీతమాలికను సమర్పించ డానికి ఏర్పాట్లు గావింపబడి బాలనగరులు వెంటరాగా గౌరబాలిక లతో వాసవికన్యక తల్లిదండ్రులయిన కుసుమశ్రేష్ఠి కుసుమాంబిక లతో విచ్చేసి రాజును దర్శించిరి. అమూల్యములగు వస్త్రద్రవ్యా లను కుసుమ దంపతులు విష్ణువర్ధనరాజుకు అర్పించి సత్కరిం చిరి. కన్యకలు మంగళహారతుల నిచ్చిరి. గౌరబాలికలకు మధ్య

మధుర కంఠంతో విష్ణువర్ధనుని మెప్పించే శివసంస్తుతి గీతమాలి కను వాసవికన్యక ఆలాపించెను. సుమధుర రాగరమ్య గీతాలాప నకు తన్మయుడైన విష్ణువర్ధనుడు ఆమెవైపు దృష్టినిడి అపూర్వ సౌందర్యాన్ని మనసులో సంభావించి మెచ్చుకొని మన్మధ వికా రమును బొంది సన్మానానంతరం ఏమా సౌందర్యం? ఎవరా కన్య? ఆ సంగతి తెలుసుకరమ్మని తన మంత్రిని పంపి కుసుమ దంప తుల ఏకైక పుత్రికగా సమాచారము తెలుసుకొని ఆమెను వివాహ మాడదలచి ఆ కోరికను మంత్రిద్వారా కుసుమ దంపతు లకు తెలియపరచి వెళ్ళినాడు. ఆ విషయాన్ని విని కుసుమశ్రేష్ఠి నిశ్చేష్టు డయినాడు. ఎనిమిది దినాల గడువులో నిశ్చయించు కొని విష్ణుభూపతికి తెలియపరచవలెననే సంగతిని కుసుమభూపతి తన బంధువులతో ప్రముఖులతో ఆలోచించినాడు. ఈ మాట విన్న బంధువులు ప్రముఖులు తెల్లబోయి ఏమి మాట్లాడవలెనో తోచక దిగులుతో నిట్టూర్చినారు. "కులాచార ధర్మవిరుద్ధ మటుంచి కన్యక ఇష్టానిష్టాలకు అవకాశమీయకుండా తనకిచ్చి పెండ్లిచేయవలెననే విష్ణువర్ధనుని నిరంకుశమయిన దురహంకార మయిన వాంఛను తిరస్కరిస్తూ వచ్చిన బంధుజనంతో ప్రముఖు లతో కుసుమశ్రేష్ఠి సమాలోచన చేసినాడు. ఈ బాంధవ్యము ధర్మవిరుద్ధము అని నిర్ణయించి వైశ్యసచివోత్తములతో విష్ణు వర్ధనునకు తెలియపరచెను. అందుకు విష్ణువర్ధనుడు నిప్పులు తొక్కుతూ ఆ కన్యను తనకిచ్చి వివాహం చేయనిచో బలాత్కా రముగనైనా కొంపోయి వివాహ మాడెదనని వచ్చిన సచివులకు తెలియపరచెను.

ఈ సంగతిని 714 గోత్రజులయిన పెద్దవారికి తెలియ పరచి ధర్మవతీసభను ఏర్పాటు చేయించి ఈ విషయమును ప్రస్తావనకు తెచ్చినాడు. ఆ నిండుకొలువులో కులగురువు అయిన భాస్కరాచార్యులు ధర్మనిర్ణయం చేయడానికి ధర్మాసనంపై అధివసించియుండగా సభాంగణంలో 714 గోత్రముల ప్రతినిధులు చర్చించి - క్షత్రియుడు సమస్త కుల కన్యలను వివాహమాడ వచ్చును కాబట్టి వాసవిని ఇచ్చి పెండ్లిచేయుట ధర్మసమ్మతమే నని 612 గోత్రములవారు అనేకోదాహరణలిస్తూ ప్రకటించినారు. 102 గోత్రములవారు మాత్రము అందుకు ఇష్టపడక ప్రభు నిరంకుశత్వాన్ని ధిక్కరించి - వాసవి అభీష్టము లేకుండా మన మీ విషయం అంగీకరించుట సిగ్గుచేటని, బలవద్విరోధ మని భయము చెంది అంగీకరించుట కాదా? అని నిర్భయంగా ప్రకటిస్తూ రాజునకు కన్య నీయుట వీలుపడదని వాదించినారు. ఈ ఇరుపక్షాల వాదము విన్న కుసుమార్యుడు అగ్నిప్రవేశమైనా చేతునుగాని వాసవిని రాజుకిచ్చుట పొసగదని సభాంగణంలో చాటగా 612 గోత్రములవారు సభను విడిచి వెళ్ళిపోయినారు. 102 గోత్రములవారు భళాభళీ అని సింహనాదాలు చేసినారు. తదనంతరం ధర్మాసనస్థుడై ఉన్న భాస్కరాచార్యులు తుది తీర్పులో విష్ణువర్ధనునకు కన్య నీయ తలపడుట బలవద్విరోధానికి భయపడటమే అవుతుందని 102 గోత్రజులు చెప్పిన వాదాన్నే బలపరుస్తూ ఏదిఏమైననూ కన్య ఇష్టపడక విష్ణువర్ధనునకు ఇచ్చి పెండ్లిచేయడం ధర్మసమ్మతం కాదని తీర్మానించెను. ఆ తీర్మా

నము విన్న నూటొక్క గోత్రములవారు సమస్త త్యాగములకు సంసిద్ధమై విష్ణువర్ధునకు వాసవికన్య నిచ్చి వివాహం చేయడం ధర్మసమ్మతం కాదని భాస్కరాచార్యుల తీర్పును కుసుమభూపతి తెలియపరచవలె నని ముక్తకంఠంతో ఎలుగెత్తి చాటినారు. యువకులు వీరకిశోరాలై గర్జించినారు. కుసుమభూపతి నూట ఒక్క గోత్రాల ప్రతినిధులతో "బిడ్డలారా! సోదరులారా! ఈ తీర్పుతో మనమంతా విషమస్థితిని ఎదుర్కొనక తప్పనివిధి అవుతుంది. ఈ క్షణంనుంచి మీరు తీసుకొన్న దీక్షలు సడలించక రాబోవు దుర్ఘటనల నెదుర్కొనడానికి సన్నద్ధులు కండి - విష్ణువర్ధనుడు దండెత్తి వచ్చినా త్రిప్పికొట్టే ఏర్పాట్లకు సాయుధులం కాక తప్పదు. యువసైన్యం వీరయోధసైన్యం బాలభటసైన్యం క్రమశిక్షణ కలిగి విష్ణువర్ధనుని ధాటిని ఎదుర్కొనవలయు నని, జై భవానీ నాదంతో ప్రతిఘటించవలెనని, ఈ రోజే ఈ వార్త రాజరాజునకు ఎరిగించడానికి రాయబారిని పంపించెద"నని చెప్పి సమాప్తము చేసెను.

ఆ క్షణంనుంచి యువసైన్యమునకు విరూపాక్షుడు సేనాధిపతిగా - వీరసైన్యమునకు కుసుమాఖ్యుడు సైన్యాధ్యక్షుడుగా - బాలభటసైన్యానికి శివప్రసాద్ పేరు గల వ్యక్తి నాయకుడుగా కట్టుదిట్టములు పూర్తిచేసి సర్వసంసిద్ధంగా విష్ణువర్ధనుని దండయాత్రను త్రిప్పి కొట్టడానికి ఆయత్త మైనారు. కుసుమభూపతి స్వగృహము చేరి జరిగిన వృత్తాంతము కుసుమాంబికకు, వాసవి కన్యకకు వివరించినాడు.

కుసుమాంబ దీనాననయై విలపించసాగెను. ప్రాణనాథా ! అఖండ సేనానిధియైన విష్ణువర్ధనుని జయించుటకు మన సైన్య పరివారము సరిపోవునా? దిగ్విజయయాత్ర చేసి నానావిధ రాజుల నుక్కడగించి సమస్త ధనరాశులను సేకరించి తనకు లోబడిన వారిని సింహాసనస్థులుగా చేసి విశేషమైన పొగడ్తల నందిన విష్ణువర్ధనుణ్ణి జయించ సాధ్యమా? ఎందుకీ ధర్మనిర్ణయము చేసి నారు. ఒక్కగానొక్క కూతురు. లేకలేక పుట్టినది. పదునారేండ్ల ఈడుతో వివాహ వేదికమీద తోడైన పతితో మురిసిపోవలసిన నా కూతురును ఇంతటి ధర్మనిర్ణయంతో ఏమైపోవునో ఆలోచిం చారా ! ఇదియేమి నిర్ణయము అని విలపించే కుసుమాంబికను గాంచి వరపుత్రియైన వాసవి కన్యకా పరమేశ్వరి అమ్మా! ఏల విలపింతువు. నే నా విష్ణువర్ధనుని పెండ్లాడను. అగ్నికాహుతియై నా శరీరాన్ని చాలింతునేకాని నేనాతనిని పెండ్లాడను. ఈ నిర్ణ యమునకు తిరుగులేదని కులగురువు భాస్కరాచార్యులుగారు ఇచ్చిన తీర్పును నాన్నగారు తీసుకున్న నిర్ణయాన్ని ఈరెండూ నాకిష్టసంపన్నములైనవి. అందుకు నే నానందించుచున్నాను. అని పలుకగా కుసుమాంబ తల్లీ ! మన నగరంలోని ఎవరినో ఒక వైశ్య యువకుడిని ఎన్నుకో, మన ధర్మప్రకారం వివాహం చేయింతుము ముహూర్తము నిర్ణయింతుము సెలవిమ్ము తల్లీ అని ప్రాధేయపడినది. అందుకు వాసవికన్యక తల్లిదండ్రులను సమీపించి అమ్మా! నీవు మహా ధన్యురాలవు. నీ నోములు పండి నవి. కనుకనే నేను నీగర్భమున జనించినాను. తండ్రి యశస్సుకు కారకురాలుగా నేను జన్మించినాను. నేను ఆదిశక్తిని. పరాశక్తిని.

నీచుడగు విష్ణువర్ధనుని చంపి ధర్మాన్ని వైశ్యకులాన్ని స్త్రీ లోకాన్ని ఉద్ధరించడానికే వచ్చినాను చూడుము నా స్వరూపము అని తన దివ్యస్వరూపాన్ని నాలుగు చేతులయందు పద్మ, కీర, వరదాభయ ముద్రలతో పద్మస్థితయై మణికిరీటధారిగా మంగళ మహాతేజంతో దర్శనమిచ్చి ఓ పవిత్రాత్ములార! నన్ను అందరి వలె మీరిపుడు కూతురుగా భావించరాదు. పాపియైన విష్ణువర్ధనుని దుష్ట దృష్టిచే నా ఈ మానవ దేహము అపవిత్ర దూషితమైనది. ఇక దానిని నేను త్యజించుట కొయత్తమైతిని. మీరేమి చింతించ రాదు. నశ్వరమైన దేహేంద్రియాలను విష్ణువర్ధనుడు కోరినాడు గాన ఈ నా దేహాన్ని పవిత్రాగ్ని కర్పించి యుగయుగాల వైశ్య జాతి కీర్తిని నిలిపెదను. నా మరణవార్త విన్నంతనే దుష్టుడైన విష్ణువర్ధనుడు తలపగిలి కుప్పకూలి దిక్కులేని హీనమరణమును పొందును. నా భక్తులు మీలో కొందరు నాతోబాటే అగ్నిప్రవే శానికి సిద్ధముకండు. గోత్రమున కొక్కొక్క దంపతులు (వృద్ధు లైనవారు) నాతోబాటు అగ్నిప్రవేశము చేసినచో ఆ గోత్రికుల వారసత్వము యుగయుగాలవరకు యశస్కరంగా పవిత్రంగా వంశవృద్ధి కలిగి జీవిస్తుంది. విష్ణువర్ధనుని సైన్యము నశించి పోతుంది. అగ్నిగుండములు సిద్ధము చేయుమని చంద్రశేఖర మందిరంలో ఆ దైవార్పణముగా నా వివాహక్రతువును ముగించ వలెనని కోరి వెంటనే మామూలుగా మానవకన్యకగా మారినది. ఇది అంతయు కన్నులార తిలకించిన జననీ జనకులైన కుసు మాంబ కుసుమభూపతులు మహదాశ్చర్యంతో ఆనందభరితులై

జగన్మాత లోకపావని మన ఇంట జనించినది కేవలము దేహ ధర్మాన్ని పాలించే సామాన్యులం అని తలచి తల్లీ! నీ యాజ్ఞను శిరసావహింతుమని కుసుమాంబ కుసుమభూపతులు చేతులు జోడించి నీవు అగ్నిగర్భాన ఉదయించినావు-నిప్పులా పెరిగినావు అటులనే నిప్పులోనే నీ తనువును స్వర్ణదీప్తం చేయతలచు కొన్నావు. నీవు అగ్నిదీప్తవు లోకమాతవు మేమెంతవారము అని చేతులు జోడించి కాగల కార్యమును నిమిత్తమాత్రులై నిర్వర్తింపదొడగిరి. అప్పటినుంచి ఉత్సాహము - తేజస్సు - ధైర్యము-త్యాగము-పౌరుషము నూటొక్క గోత్ర సంతతులలో ద్విగుణీకృతము కాజొచ్చెను. ఎక్కడలేని చైతన్యము స్త్రీ, పురుష, యువ బాల వృద్ధ భేదములు లేక పనులు చకాచక సాగిపోజొచ్చెను.

కన్య నిచ్చుటకు వీలు కాదని రాయబారము తీసుకొని పోయిన రాయబారులను నిందించి విష్ణువర్ధనుడు "ఇదుగో! దండెత్తి వస్తున్నాను. మీ పురాన్ని, మిమ్మలను సర్వనాశనము చేసి కన్యను బలాత్కారంగా కొనివత్తు"నని తిరస్కారమున పంపివైచినాడు. వారు పరుగుపరుగున వచ్చి ఈ వార్త కుసుమాఖ్యునకు వినిపించినారు. ఈవార్త విన్నమీదట పురంలో చాటింపు చేసి వాసవికన్యక అగ్నిప్రవేశం చేస్తుంది గోత్రాని కొక (వృద్ధ జంట) అగ్నిప్రవేశం చేయవలెనని-విష్ణువర్ధనుడు పెనుగొండపై దండెత్తి వస్తున్నాడని-ఎదుర్కొనుటకు శాయశక్తుల ప్రయత్నించవలెనని హెచ్చరికలు ప్రకటించినాడు.

విష్ణువర్ధనుడు దండెత్తి వచ్చి మనల చంపుననేభయంతో 612 గోత్రములవారు అనేకవిధాల నగరం వీడిపారిపోయి నారు. శరీరంమీది మమకారం ప్రాణంమీది తీపి ఇంత టిది కదా! అని 102 గోత్రములవారు కని నవ్వుకొనడానికి వీలుగా.

నగరేశ్వరస్వామ్యాలయంలో వివాహ వేదిక సిద్ధమైనది. అగ్నిప్రవేశార్థత సిద్ధించడానికి నగరేశ్వరస్వామి విగ్రహంతో వివాహక్రతువు మంగళప్రదంగా సకల ముత్తయిదువులు మంగళ నీరాజనాలిస్తూ పాటలు పాడగా నిర్వహించిరి. అగ్నిప్రవేశానికి అర్హమైన గుండములు దివ్యజ్వాలలతో గగనమండలాన్నే దగ్ధం చేస్తున్నదో అన పెనుజ్వాలలతో మండుచుండెను. 103 అగ్నికుండములు వైశ్యవీరుల ఆత్మబలిదానాన్ని పరీక్షిస్తూన్న నెపంగా ప్రకాశించుచున్నవో అన చిటపటలతో నా ప్రదేశ మంతయూ సెగలతో నిండారెను.

చిన్నాపెద్దలంతా పార్వతీపరమేశ్వరుల భజిస్తూ భజనలుచేస్తూ వాసవివెంట నడవసాగిరి. రథంపై వాసవికన్యక కూర్చున్నది. అది సాగుతూ అగ్నికుండాలున్నమార్గాన్నిబట్టి నడుస్తున్నది. విష్ణువర్ధనుని సైన్యాలు పెనుగొండను చుట్టినవి. అడుగు ముందు వేయజాలనిపై పొలిమేరలు దాటజాలనీని ఏదో దివ్యతేజస్సు వారి నందర నడ్డగించెను. విష్ణువర్ధనరాజు అవివేకాన్ని సైన్యం పరస్పరము చాటుకొన నారంభించింది. వచ్చిన పని మరచిరి. నిస్తేజులై శవాకృతిని దాల్చి పడిపోయిరి. జగన్మాత వాసవీ

దేవి అగ్నికుండము చేరి రథమునుంచి దిగి సమధికోత్సాహంతో జయనాదములు మిన్నుముట్టు భక్తుల రవాలలో ఆ తల్లి 102 గోత్రములవారి త్యాగాన్ని ప్రశంసచేసి వాసవికన్యక తన విశ్వ రూపమును ఒకచేత చిలుక, మరొకచేత పద్మము ఒకచేత పాశము మరొకచేత వీణ గలిగి 'చతుర్భుజే చంద్రకళావతంసే' అయి కోటిసూర్య ప్రభాభాసమై మణికిరీటధారి యై తన దివ్య రూపాన్ని చూపించినది. అప్పుడామె భక్తులారా! భయపడకుడు విష్ణువర్ధనుడు మిమ్మేమి చేయజాలడు. అతని అంత్యకాల మిదే రోజు. ఆతని సైన్యములు పెనుగొండ పొలిమేరలలో శవాలై పడిపోయినవి-ఇక మీకు భయము లేదు. మీ జన్మములు సార్థకములైనవి. మీ వంశములు పావనములైనవి. నా రూపము భజించువారికి సకలైశ్వర్యభోగములు సిద్ధిస్తాయి. ఇదిగో మీకు కొన్ని ధర్మములను చెప్పెదను. అవి పాటించిన మీకు శ్రేయస్సు సిద్ధించునని వాటిని ఇట్లుపదేశించినది.

1. ఏసమయమందైననూ దైవభక్తిని విడనాడరాదు.
2. అరివర్గమైన కామక్రోధలోభమోహాదులకు స్థాన మీయరాదు.
3. సచ్చిదానంద పరబ్రహ్మన్నే సేవించి విజ్ఞానాత్ములై ముక్తిని సాధించండి!
4. సజ్జనులను-ఆర్తులను-భక్తులను-దుర్బలులను-జ్ఞానులను-మహాత్ములను ఆదరించి సేవించుడు.

5. రాగబంధులై యోగమును త్యజించరాదు. యోగము ముక్తిదాయకము.

6. విషయాసక్తి విడనాడి పరమాత్మాసక్తులై జీవనము చేయుడు.

7. ఆశ్రమధర్మాలను పాటించుడు.

8. అభ్యాసముతో చిత్తాన్ని వైరాగ్యపథంవైపు మళ్ళించుడు.

9. ఈ లోకాన్ని శాశ్వతమని నమ్మి కొలువరాదు సృష్టి సమస్తము వికృతమై సాగుతుంది. ఎవరూ శాశ్వతులు కారు.

10. సర్వవ్యాపకమై స్వరూప లక్షణంగా ఉండే ఆత్మను లేదనుకొనడమే నాస్తికత్వము-అవివేకము. పరబ్రహ్మం నేననే దివ్యతలంపుతో ముక్తిని సాధించుడు.

11. వైదికాచారాలను ఆచరించవలెను.

అని ఎన్నో మహాధర్మాలను సామాన్య విశేష ధర్మాలను ప్రబోధించి విశ్వరూపమును చాలించి అగ్నిప్రవేశము చేసెను. 102 గోత్ర దంపతులు వాసవికన్యక అగ్నిని ప్రవేశించినట్లే వారు అగ్నిప్రవేశము చేసిరి. వాసవికన్యక వసువిగ్రహమై

తన దివ్యాత్మను పరమేశ్వరిలో విలీనము గావించుకొనెను. ఆ విగ్రహం గలచోటనే ఒక దివ్యభవనంగా గోపుర శిఖరాగ్రాలతో దేవళమై నిలిచెను.

విష్ణువర్ధనరాజు ఈ వార్త విని శిరము వ్రక్కలై మరణించెను. మరణించిన మహారాజుసంగతి తెలిసి కుమారుడయిన రాజరాజు యేతెంచి తండ్రి శవమును గొంపోయి దగ్ధము గావించినాడు.

ఒక శుభ సుముహూర్తమున రాజరాజు స్వయంగా ఏతెంచి సమస్త రాజ పురోహిత జన సమక్షంలో కుసుమభూపతి కుమారుడయిన విరూపాక్షునికి పట్టాభిషేకం చేయించి రాజ కిరీటము తొడిగి దీవించి స్నేహముతో రాజవిధులను నిర్వహించుమని మాట ఇచ్చి వెళ్ళినాడు.

కాశీయాత్ర సల్పి 101 గోత్రములవారి చితాభస్మాన్ని గంగాగర్భంలో పవిత్రం చేసి ఆత్మత్యాగ చిహ్నములుగా నూటఒక్క లింగాలను వెంట తెచ్చి పురవీధిలో నిల్పి దానికి లింగాల వీధి అని విరూపాక్షుడు నామకరణం చేసినాడు.

కన్యకాపరమేశ్వరి వెలసిన చోటనే శ్రీజనార్దనస్వామిని, శ్రీ నగరేశ్వరస్వామిని నిల్పి నిరంతరం విరూపాక్షుడు సేవించడంతో బాటు తన రాజ్యమును, భాస్కరాచార్యుల ధర్మతీర్మానములతో సుఖప్రదముగా పాలించినాడు. సమస్త జనం శాంతచిత్తంతో సుఖజీవనము చేసి ఆనందించింది.

ఈ కథను వీర ముష్టులు నోరార గానం చేసి చిరం జీవము గావించిరి. సాలంకాయనముని ప్రవచితమై ధరణీమండలమున కూర్పులతో చేర్పులతో మార్పులతో చిరంజీవమై తరతరాల జనానికి ఆదర్శకమై కొనసాగునని సంపూర్తి చేయగా వైశ్యమునులు విని మహదానందము చెందిరి.

—o—

# మంగళము

మంగళము మంగళము వాసవీదేవీ !
మంగళము వైశ్యకులగుణ కీర్తిచంద్రికా! ॥మం॥

కుసుమాఖ్య దంపతుల వరరత్నమీవు
అసమాన లోకవిఖ్యాత తేజమవు
విష్ణువర్ధనహారి ! విమల యశస్వి !
పరమపావన రమ్య భాగ్యసంధాయి ! ॥మం॥

శీలరక్షణము విశేషమన్నావు
అతులితాదర్శ సన్నుతు లందినావు
అగ్నిదీప్తగ నీవు అలరినావమ్మా
అందుకోవే మంగళారతి తల్లీ ! ॥మం॥

★ ★

# పూర్వ జన్మలు

—:o:—

కుసుమ శ్రేష్ఠి :- స్వారోచిష మనువుకాలంలో సమాధి అనే వైశ్యోత్తముడు భార్యాబిడ్డల అనుమతి పొంది సుమేధుడనే బ్రాహ్మణ ఋషివలన విష్ణుమాయాప్రభావాన్ని గ్రహించి మోక్షానంద లక్ష్యంగా దేవినిగూర్చి 3 సంవత్సరాలు గొప్ప తపస్సు చేసినాడు. దేవి ప్రత్యక్షమైనది. నూటొక్క వంశాలతో తనకు మోక్షం కావాలని ఆ దేవిని ప్రార్థించినాడు. దేవి సమాధి కోర్కెను అనుగ్రహించింది. ఆ సమాధి దుర్వాసముని వాక్కుతో కల్హారుడనే వైశ్యునికి పుత్రుడై కుసుమశ్రేష్ఠి పేరుతో వర్ధిల్లి పన్నెండు సంవత్సరాల వయస్సులో ఉపనయనం జరిగి భాస్కరాచార్యులవద్ద వేదవేదాంగాది విద్య లభ్యసించి మణికుండలుడనే వైశ్యోత్తముని పుత్రిక కుసుమాంబికతో వివాహం జరిగి పుత్రకామేష్టి యజ్ఞం నిర్వహించి వాసవిని, విరూపాక్షుడనే బిడ్డలను పొంది వాసవివలన నూటొక్క వంశాలవారితో తన కభీష్టమైన మోక్షం పొందినాడు.

కుసుమాంబిక :-మణికుండలుడనే వైశ్యోత్తముని పుత్రిక. పెనుగొండ నగరాధీశ్వరుడైన కుసుమభూపతికి అర్ధాంగి. వాసవీ విరూపాక్షులకు కన్నతల్లి.

కళ్హారుడు :-పెండ్లి కులగోత్రమును కుసుమేశ్వరుని ఆరాధించి పవిత్రము చేసినాడు. కుసుమశ్రేష్ఠికి కన్నతండ్రి. పెండ్లి కులగోత్రమందు వాసవి జనించి పవిత్రత కలిగించినది కాబట్టే పెండ్లికులగోత్రంవారంతా 'వాస' లేదా 'వాసా' అనే ఇంటిపేరున ఉన్నారు.

వాసవీదేవి జననం :-వైశాఖ శు॥ దశమీ శుక్రవారం పునర్వసు నక్షత్రం (శ్రవణ నక్షత్రం అని మరికొందరు వ్రాసినారు).

వైశ్యశబ్దం :-చాతుర్వర్ణ్యాలలో ఒకటి. ఋగ్వేదంలో ఈ పదం ఉన్నట్లు కొందరంటారు. వ్యాసప్రోక్తమైన భగవద్గీతలో వైశ్య శబ్దం వాడబడింది. ఆర్యసంబంధమై ఈ పదం ఆర్య వైశ్యగా ప్రచారంలోకి వచ్చింది.

వైశ్య ప్రవృత్తులు :-యజనాధ్యయన దాన గోరక్షణాది ధర్మానుబంధమైన వ్యాపారములన్నీ చేయవచ్చును.

★ ★

# ఆంధ్ర వైశ్యులు - ఆచారాలు

—★—

వేదంలో వైశ్య శబ్దం ప్రమాణీకరించి ఉన్నది. భగవద్గీతలో గుణకర్మవిభాగాల ననుసరించి వైశ్యపదం చెప్పబడింది. తెలుగులో సుమతి శతకకారుడు "కోమటి" గా ప్రయోగించినాడు. ఈ వైశ్యులకు ఆర్యవైశ్యులని - కోమట్లని- వణిజులని కవులు సృష్టించిన సాహిత్యంలో, సంస్కృతాది భారతీయ భాషలలో ప్రశంసలపరంగా ఉన్నది. బచ్చు నామంగా కూడా కొనియాడబడినారు.

వ్యక్తుల పేర్ల చివర సెట్టి-శ్రేష్ఠి-శెట్టి-గుప్త- దాస-రావు వంటి రూపాలలో వైశ్యులున్నారు. సెట్టి-సేట్ గా వ్యవహరింపబడుతోంది. ఉరుదూ భాషలో 'బన్యా' 'బనియా' అంటున్నారు. సాహుకారి [సావుకారి] అంటున్నారు. కొన్నిచోట్ల వర్తకుల పేర వైశ్యులున్నారు. భారతదేశంలో వైశ్యులు నానా రకాల పేర్లతో ఉన్నారు.

విశ్వ పరివ్యాప్తంగా వైశ్యులు ఈనాడున్నారు. వైశ్య శబ్దమే అతి ముఖ్యమైన పదంగా గమనించి ఆంధ్రులు వైశ్య సంఘాలు - ఆర్యవైశ్య సంఘాలు - సేవాసదనాలు - సంస్థలు నెలకొల్పినారు. ఆంధ్రదేశార్యవైశ్యులు వాసవిపరంగా కల్యాణ

మంటపాలు - దేవాలయాలు - అన్నసత్రాలు - విద్యాలయాలు - సంఘాలు - వసతి గృహాలు నిల్పినారు.

వాసవి కన్యకా పరమేశ్వరి అగ్ని ప్రవేశానికి పూర్వం 714 వైశ్యులగోత్రా లుండేవి. అందులో 102 గోత్రాలు అగ్ని ప్రవేశం చేసినవారు వైశ్యలోకంలో సుప్రసిద్ధి వహించారు. ఒక గోత్రం అగ్నిప్రవేశం చేసేనాటికే సంతానం లేక ఆ దంపతులతోనే ఆ గోత్రం అంతరించింది. మిగిలిన నూటొక్క గోత్రజులైన వైశ్యులు ఆర్యవైశ్యులని, ఏగిన కోమట్లని ప్రసిద్ధి పొందినారు. ఋషిగోత్రాలు గాక సంకేతగోత్రాలలో పిలువబడే ఈ నూటొక్క గోత్రాలలో "ల"కారం తప్పనిసరిగా ఉంటుంది. ఆ 'ల'కారమే సంకేతంగా ఉన్నవారితో బంధుత్వాలు నెరపవలె ననే నియమము - కన్యకాంబ అగ్నిప్రవేశానంతరము ప్రచారమయ్యింది.

ఉదాహరణకు : మా గోత్రం 'రెంటకుల'. దీనిలో చివర 'ల' ఉన్నది. నీలా అనే ఇంటిపేరు. మీలా, నీలం, శ్యామా, సామా అనే ఇంటిపేర్లతో ఉన్నది. ఇదేకాక 'పబ్బా' ఇంటిపేరు ఉన్నవారి గోత్రంకూడా రెంటకుల గోత్రమే.

—*—

# వైశ్యుల వివాహాలకు ముందుగా చూసే

# గోత్రాలు - వరసలు

—★—

పిల్లవానిది మూడు గోత్రాలు - పిల్లది మూడు గోత్రాలు భిన్నంగా [ఎబ్బెట్టుగా] ఉండేటట్లు చూసి వరస లరసి వియ్యమందడం ఉంది. కొందరు రెండు గోత్రాలవరకే ప్రాధాన్యం ఇస్తారు, మూడో గోత్రాన్ని చూడరు. గోత్రాలతోబాటు పాదం, గణం, నాడి, రాశి, యోనికూటాలను కూడా- పిల్లవానిది పిల్లది జన్మనక్షత్రాన్ని అనుసరించి లేదా వ్యవహారనామ నక్షత్రాల్ని బట్టి అనుకూల లక్ష్యంగా కల్యాణనిర్ణయాలు చేస్తారు. సగోత్రాలు నిషిద్ధం. పిల్లవాని ననుసరించిగాని, పిల్లననుసరించిగాని గోత్రములు - వరసలు తెలుసుకొనవచ్చును.

1. పిల్లవానిగోత్రం - తండ్రిదే [మొదటిది]
2. పిల్లవాని మేనమామ గోత్రం [రెండోది]
3. పిల్లవానితండ్రి మేనమామగోత్రం [మూడోది]

1. పిల్లగోత్రం - తండ్రిదే [మొదటిది]
2. పిల్ల మేనమామ గోత్రం [రెండోది]
3. పిల్లతండ్రి మేనమామగోత్రం [మూడోది]

:: ఉదాహరణకు ::

| పిల్లవాని గోత్రాలు | | పిల్ల గోత్రాలు |
|---|---|---|
| 1. రెంటకుల | ... | 1. ఎలిసెట్ల |
| 2. శనిసెట్ల | ... | 2. వెన్నకుల |
| 3. నాభిళ్ళ | ... | 3. తోటకుల |

ఈ మూడు గోత్రాలలో - ఏ ఒక్కరివీ ఏకరూపమైన గోత్రాలు కాలేదు - కాబట్టి వివాహానికి అర్హులవుతారు. రాశి కూటాలు కొందరు పాటిస్తారు. కొందరు పాటించరు.

## వరస తెలియడానికి గోత్రాలు చూసే పద్యం

1-3 పిలవాని దొక్కటి - పిల్లది మూడోది 3-1
కన నొక్కటే యైన - మనుమరాలు

3-1 పిలవానిదే మూడు - పిల్లది ఒకటోది 1-3
తలప నొక్కటి యైన - తల్లి వరస

2-3 పిలవానిదే రెంట - పిల్లది మూడొక్క- 3-2
టన దెల్యనౌ గదా - తనయవరస

3-2 పిలవానిదే మూడు - పిల్లది రెండోది 2-3
ఐన ఒక్కటిగ మేనత్త వరస

1-2 పిల్లవానిది ఒక్కటి - పిల్ల రెండు 2-1
గోత్రములు నొక్కటైనచో - కోడలౌను

2-1 పిల్లవానిది రెండోది - పిల్లదొకటి 1-2
కలియ మరదలు గోత్ర మేకంబు చెల్లె

# ఏకగోత్రాలు

పిలవానిది 1 - పిల్లది 1

పిలవానిది 2 - పిల్లది 2

పిలవానిది 3 - పిల్లది 3

చెల్లెలివరస ఎవరికీ పనికిరాదు.

తల్లి తనయ వరసలు కూడా పనికిరావు.

ఈ కాలం పాటింపులు ఆ యా మండలాలలో ఉండే ఆచారాలనుబట్టి ఉంటాయి. ఇష్టాలనుబట్టి పెండ్లిళ్ళ తీర్లు ఉంటుంటాయి. మేనరికం తప్పనిసరిగా చేసుకోవలెనని ఈనాడు లేదు.

వైశ్యులు వేదవిహితమైన కర్మలన్నింటినీ ఆచరిస్తారు. షోడశసంస్కారవిధులన్నీ నిర్వర్తిస్తారు. ముఖ్యంగా ఉపనయన సంస్కారం వైశ్యకుమారులకు 12వ ఏడున జరుపుటకు వేదం ఆజ్ఞాపిస్తుంది. అక్కడినుంచి 24 సంవత్సరాలలోపున ఉపనయన సంస్కారం జరపడం శ్రేయస్కరం. 24 వయస్సు దాటినచో ఉపనయన సంస్కారానికి బాలుడు అర్హత కోల్పోవును.

యోగ్యుడైన బాలుడైనచో ఎనిమిదవ ఏటనే ఉపనయన సంస్కారం చేయవచ్చును. ఉపనయనకాలంలో బాలుడు పసుపు వస్త్రధారణ చేయవలెను.

★ ★ ★

# అభిప్రాయములు



"వాసవి కన్యకా చరిత్ర అనే ఈ గ్రంథానికి 'అగ్నిదీప్త' అనే పేరు పెట్టడంలోనే మన కవిరత్న శ్రీ నీలా జంగయ్యగారి కవిత్వపు సత్తా సువ్యక్తమవుతున్నది. ఆయన ఆలోచనా సరళి వినూత్నమై భాసించింది. అది కొట్ట వచ్చిన ట్లగుపడుతుంది. చక్కని వచనంలో సర్వులకర్థమయ్యేవిధంగా తీర్చి ఆంధ్రజాతికి అందించినందున వారిని నే నభినందిస్తున్నాను. వెల స్వల్పము, ఫల మధికంగా ఉన్న ఈ గ్రంథాన్ని సర్వులు చదివి శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరి కృపకు పాత్రులు కావలెనని ఆశిస్తున్నాను. దీనిలో బాసర సరస్వతీఅమ్మవారి చిత్రం ప్రార్థనానుబంధమై ఉన్నది. ఆ దేవి దర్శనమాత్రంతో అజ్ఞానం పటాపంచలై జ్ఞానము పొందుతారన్నది ప్రసిద్ధి. వైశ్యప్రశస్తిని చాటే ఈ గ్రంథం ఆంధ్ర సాహిత్యంలో సమున్నత స్థానం పొందుతుందని ఆశిస్తున్నాను."

జి. నారాయణశెట్టి, ఐ.ఏ.ఎస్. [రిటైర్డు]
విశ్వహిందూపరిషత్-అధ్యక్షులు.

★



" 'అగ్నిదీప్త' అను కన్యకా పరమేశ్వరి చరిత్ర చాలా చక్కగా పండిత పామరుల కర్థమయ్యే పద్ధతిలో వ్రాసినారు 'కవిరత్న' శ్రీ నీలా జంగయ్యగారు. అమ్మవారి సమకాలికులు ఆచరించు ఆచారములు వారి విచారములు వైశ్యశుద్ధి విచారణ-అమ్మవారి కుటుంబీకులు పూర్వ

జన్మ వృత్తాంతము విపులముగా వివరించబడినది. ప్రతివైశ్యుడు తప్పక చదవవలసిన హొత్తము."

వేలూరు దూర్వాసులుగుప్త
అఖిలభారత వాసవీ కన్యకా పరమేశ్వరి
దేవాలయముల సమాఖ్య అధ్యక్షులు

★ ★

# "అగ్నిదీప్త"
# ఆవిష్కరణ మహోత్సవం

తేది 13-7-83 సాయంత్రం 4 గంటలకు హైదరాబాదు నగరంలోని ఎగ్జిబిషన్ గ్రౌండ్స్ ఆవరణంలో శ్రీ జి. నారాయణ సెట్టి, ఐ. ఎ. ఎస్. (విశ్వ హిందూ పరిషత్ అధ్యక్షులు) గారి అధ్యక్షతలో శ్రీ వేలూరు దూర్వాసులుగుప్త (ఆలిండియా వాసవీ టెంపుల్స్ సమాఖ్య అధ్యక్షులు) గారు ఆవిష్కరించారు. శ్రీమతి కబళవాయి పుష్పావతిగారికి కవిరత్న శ్రీ నీలా జంగయ్యగారు అగ్నిదీప్త వాసవీ కన్యకా పరమేశ్వరి కృతిని నూతన వస్త్రాలతో కానుకగా సమర్పించి సమర్పణ పద్యాలు చదివారు. జంగయ్యగారి అర్ధాంగి శ్రీమతి లక్షమ్మగారు పుష్పావతిగారిని పూలమాలతో నూతన వస్త్రాలతో సత్కరించగా పుష్పావతిగారు లక్ష్మమ్మగారిని తిరిగి సత్కరించారు. పుష్పావతిగారి భర్త

శ్రీ కలశవాయి రాధాకృష్ణగారు కవిరత్న శ్రీ జంగయ్యగారిని స్వర్ణాంగుళీయంతో నూతన వస్త్రాలిచ్చి సత్కరించి కవిగారు మాపట్ల వ్యక్తంచేసిన అనురాగానికి సర్వదా కృతజ్ఞులమని సానందంగా చెప్పినారు.

"అగ్నిదీప్త" పేరే బహుచక్కగా కుదిరింది. ఈపేరుతో వాసవి కన్యకా చరిత్ర రావడం బంగారానికి తావి అబ్బినట్లుందని అందరికి అర్థమయ్యే వచన శైలిలో ఉందని శ్రీ వాసవీ విశ్వశాంతి మహాయజ్ఞం ప్రారంభమైన ఈరోజున ఈ కృతి యజ్ఞవాటికకు సమీపంలోనే ఆవిష్కరణ జరగడం విశేషమంటూ సభలో ప్రసంగించిన వక్తలు-మాన్యులు సీతయ్య గుప్తగారు-కె. సి. గుప్తగారు పల్కగా, యజ్ఞానికి నేతృత్వం వహించిన నారాయణదాసుగారు రెండుచేతులెత్తి సభను ఆశీర్వదించినారు. మాన్యులు కేంద్రమంత్రి శ్రీ పెందేకంటి వెంకట సుబ్బయ్యగారు తన ప్రసంగంలో జంగయ్యగారి పేరు తీసుకొని వారిచేత ఇట్లాంటి కృతులెన్నో వ్రాయించవలసి ఉన్నది. మన మేపని చేసినా కులమతప్రాంతాది విభేదాలు లేని విశ్వశ్రేయస్సునే అభిలషిస్తామని, కన్యకా పరమేశ్వరి నిరంకుశ రాజధిక్కారం చేసిన తొలి సత్యాగ్రహి అని, ఆమె ప్రశస్తి విశ్వవ్యాప్తి గావాలని అందుకు తగిన ప్రాథమిక విద్యను వైశ్యులు పోషించాలని విద్యాలయాలు నిర్మించాలని సందేశం ఇచ్చారు. శ్రీ కె. కృష్ణారావుగారు వందన సమర్పణ చేశారు.

ప్రకాశకులు.

★ ★ ★